

బేలూర్ దేవాలయ శిల్పం —చిత్రకారుడు: బాపు

# సెప్టెంబరు 9వ తేది ఆంధ్రదేశమంతట

ఏ.వి.ఎం ప్రొడక్షన్సు వారి

# వదిన

*నీతితో కూడిన . నూతన వినోదం కూర్చే అత్యున్నత చిత్రం*

నాగేశ్వరరావు ◦ రేలంగి ◦ బి.ఆర్. పంతులు
గుమ్మడి ◦ సావిత్రి ◦ కన్నాంబ ◦ పండరి బాయి




డైరెక్షన్: ఎం.వి.రామన్ రచన: స్వర్గీయ "తోలేటి"

# ఇది మీకు పూర్తిగా హామీ...

ప్రభుత్వం నిర్ణయించిన ప్రమాణాల మేరకు తుషార్ తయారు చేయబడుతున్నది.




ప్రతి ఔన్సులోను 700 ఐ. యు. ల విటమిన్ "ఎ" వున్నది.

చేతితో తాకబడదు.

విటమిన్ "డి" కూడా చేరివున్నది.

మీరు ఆహార పదార్థాలను వండడానికి **తుషార్** ను వాడితే, మొదటిరకం వనస్పతిని వాడుతున్నామన్న హామీ మీకు వుంటుంది. ఎందుచేతనం టే, అధునాతనమైన ఫ్యాక్టరీలో ఆరోగ్యప్రదమైన పద్ధతులలో, ప్రభుత్వము నిర్ణయించిన ప్రమాణాల మేరకు **తుషార్** ఉత్పత్తి చేయబడుతున్నది కనుక.

*దక్షిణ భారతంలోని వనస్పతి ఫ్యాక్టరీలలో కెల్ల పెద్దది అయిన ఫ్యాక్టరీలో భారతీయుల పెట్టుబడితో, భారతీయ కార్మికులచే ఉత్పత్తి చేయబడుతున్నది.*




ఔన్సుకు 700 ఐ. యు. లు — ఔన్సుకు 700 ఐ. యు. లు

విటమిన్ "ఎ" ఆరోగ్యాభి వృద్ధికి ఉపకరిస్తుంది. ఆరోగ్యాన్ని రక్షించే రక్తకణాల వృద్ధికి ముఖ్యం. వ్యాధి నిరోధక శక్తిని ఇనుమడిస్తుంది. విటమిన్ "డి" ఆరోగ్యప్రదమైన పండ్లను, ఎముకలను వృద్ధిపరుస్తుంది.

**తుంగభద్ర ఇండస్ట్రీస్ లిమిటెడ్., కర్నూలు.**

| | | |
|---|---|---|
| సంవత్సర చందా<br>రు: 12-0-0<br>విడిప్రతిక 4 అ. | # ఆంధ్రపత్రిక<br>సచిత్రవారపత్రిక | సంపుటము 40<br>సంచిక 1<br>7-8-55 |

**Founder : K. NAGESWARA RAO**

మన్మథ అధిక భాద్రపద బహుళ పంచమి బుధవారం




ఆగస్టు 24 వ తేదీని విజయవాడదగ్గర కృష్ణానదిలో బరాజ్ వద్ద లాంచి మునిగిదిపదిమంది మరణించారు. ఫొటోలో వరద వేగానికి అడ్డంగా పడివున్న లాంచీ కనపడుతుంది.




జి.సి. రామకృష్ణ

## 2

ప్రతి హరిజనవాడలో ఒక పూరి గుడిసె. ఆ గుడిసెలో ఒక రామభక్తుడు వేకువనే లేచి, స్నానంచేసి, నుదుట పెద్ద కుంకుమబొట్టు పెట్టుకొని సీతారామస్వామి పటంముందు కూచొని,

"రామ రామ రామసీతా
సీతా రామ రామ సీతా"

అని రామనామసంకీర్తనం చేస్తున్నాడు. ఆ రామభక్తుని పేరు గెరటయ్య.

గెరటయ్య మంచి యౌవనంలో ఉండే రోజుల్లో వీధి భాగవతంలో నలమహారాజు, హరిశ్చంద్రుడు, ధర్మరాజు వేషాలు వేసేవాడు.

గెరటయ్య రామభక్తుడుగా మారడానికి గొప్ప కారణం ఉంది!

హరిజనవాడలో ప్రతి సంవత్సరం కలరా వచ్చి, జనాభా తగ్గించిపోతూ ఉంటుంది. మలేరియావల్ల కొంత జనాభా ఎప్పుడూ తరిగిపోతూనే ఉంటుంది.

గెరటయ్యభార్య కలరా తగిలి భర్తకు భారం తగ్గించి వెళ్లిపోయింది. గెరటయ్య కుమార్తె పదహారేళ్ళ యువతి, మలేరియా జ్వరంతో క్రుంగిపోయి లివరువచ్చి తండ్రిని ఒంటరిగా బ్రతకమని వెళ్ళిపోయింది.

గెరటయ్య హృదయంలో భార్యా బిడ్డలు చేసిన గాయం ఎన్ని రోజులకూ మానలేదు. ఆ గాయం మాన్పుకోవడానికి గెరటయ్య సీతారామస్వామిని ఆశ్రయించాడు. రామనామ సంకీర్తనం అతని హృదయానికి ఊరట కల్గించేది.

ప్రతిరోజూ గెరటయ్య వేకువజామునే లేచి రామనామ సంకీర్తనం చేస్తుంటే హరిజనవాడలో అందరూ మేల్కొనేవారు. ఆయన పాట వినిపించగానే స్త్రీలు నిద్ర లేచి, వాకిళ్లు చిమ్మడం ప్రారంభించేవారు. పురుషులు కూలినాలికి, సేద్యాలకు వెళ్తుండేవారు. గెరటయ్య రామనామసంకీర్తన హరిజనుల నిత్య జీవితంలో ప్రధాన స్థానం సంపాదించుకుంది. ఆయన తన ఆత్మ సంతృప్తికోసం భగవంతుని ప్రార్థిస్తున్నా ఆయన గొంతు హరిజనుల్ని మేల్కొల్పేది.

ఒకనాడు గెరటయ్య రామనామ సంకీర్తనం ముగించి గుడిసెలోనుండి వెలుపలికొచ్చాడు. ప్రకృతికన్య కప్పుకొన్న మేలిముసుగులాగా లోకమంతా మంచు వ్యాపించి ఉంది. సూర్యభగవానుడు తీరని ఆశలతో ప్రకృతిని కౌగలించుకొంటున్నాడు - దేవాలయంలోని పెద్ద గంట ఓంకారనాదం చేస్తూ జనుల హృదయాలను పులకితం చేస్తోంది.

రామభక్తుడు గెరటయ్య విన్నాడు ఆ ఘంటారావం. చేతికఱ్ఱ తీసుకొని, ముసిముసి నవ్వులు నవ్వుతూ, గెరటయ్య హరిజనవాడలో పిల్లలందర్నీ కేకలేసి పిల్చాడు.

"ఏం తాతా, ఏం తాతా? ఎందుకు పిల్చినావ్రా?" అంటూ పిల్లలందరూ ముసురుకున్నారు.

"మీకెందుకు రండ్రా, చెప్తా రండ్రా మీకు కేవుశిప్రసాదం పెటిస్తా రండోయ్. ఇయ్యాళ్ళనుంచీ పండగనెల కదంటోయ్" అని గెరటయ్య ఒక పిల్లలగుంపును వెంబడేసుకొని దేవాలయానికి వచ్చాడు.

ధ్వజస్తంభం అరుగుమీద దేవాలయం ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారూ, మాధవశాస్త్రి గారూ కూర్చొని ఏవో కబుర్లు చెప్పుకుంటున్నారు.

గెరటయ్య వారిద్దరికీ నమస్కరించాడు. కొంతమంది పిల్లలు కిలకిల నవ్వుతూ "నమస్కారం సార్" అన్నారు.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారు గెరటయ్యను చూచి సంతృప్తిగా నవ్వి, "శాస్త్రిగారూ, కులానికి ఎవ్వరైతే ఏంగానీ, గెరటయ్యను చూస్తే నాకు మహాభక్తుడు నందనారు జ్ఞాపకం వస్తాడండీ. మీరూ విన్నారో లేదో, కోవూరు రామమూర్తిగారు హరికథ చెప్తారూ, నందనారుకథ! హబ్బబ్బ! అద్భుతంగా ఉంటుందండీ" అన్నాడు. మాధవశాస్త్రి నిష్కల్మషమైన నవ్వు నవ్వి, గెరటయ్యను ఆదరంతో చూచి,

"ఏం గెరటయ్యా, ఎలా ఉన్నారూ... చలిజ్వరాలేమైనా తగ్గాయా లేదా మీ పాళెంలో" అన్నాడు. గెరటయ్య వినయంగా నవ్వి,

"ఎక్కడ తగ్గుతాయి స్వామీ. ప్రతి యింట్లో యిద్దరో ముగ్గురో, మంచాలమీద ఉంటానే ఉండారు. చూడండి,..." అని

## విషయానుక్రమణిక

ముఖచిత్రం: జెమినీవారి హిందీచిత్రం "ఇన్సానియత్"లో బీనారాయ్.

రటయ్య దీన వెనుక నిల్చొని పావురాళ్లను చూస్తున్న పిల్లల్ని చూపించాడు. మాధవ శాస్త్రి ఆ పసిబిడ్డల్ని చూచాడు. కుండ ల్లాంటి పొట్టలు, సన్నగా చేతులు కాళ్లూ ...నీరసించి, చూడడానికే బాధ కలుగు తోంది.

పూజారిగారైన వీరభద్రయ్యగారు, గర్భ గుడిలోనుండి వెలుపలికి వచ్చి, గరట య్యను, అతనితో కూడా వచ్చిన పిల్లల మందను చూచాడు. ఒళ్లు భగ్గున మండిపో యింది పూజారికి.

"మాలకుంభిలు పెద్ద గుంపు పోగయ్యా రూ!" అని మెల్లగా ఎవ్వరికీ వినబడకుండా అని,

"శాస్త్రిగారూ, పంతులుగారూ, లోప లికి దయ చెయ్యండి" అని పిల్చాడు.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారైన కామేశ్వర రావు పంతులుగారు, స్వెట్టరు, మఫ్లరు, సవ రించుకొని, "హబ్బబ్బ! ఏమి చలండీ ఏమి చలండీ" అంటూ, ప్రపంచ బాగా కప్పు కున్నాడు.

గరటయ్య దీనమైన చూపులతో తనతో కూడా వచ్చిన పసిబిడ్డల్ని చూచు కున్నాడు. వాళ్ల శరీరాలపైన గోచిపాతలు తప్ప గుడ్డలేవీ లేవు.

మాధవశాస్త్రిగారు, ఎగ్జిక్యూటివ్ ఆఫీ సరుగారు, గర్భగుడిలోకి వెళ్లారు. గర టయ్య ధ్వజస్తంభం దగ్గరే నిల్చుని, దేవు నికి నమస్కరించాడు.

దేవాలయం లోపలి నుండి మాధవశాస్త్రి పిల్చాడు "గరటయ్యా! లోపలికి రాండి ఫరవాలేదు". అని కేక వేశాడు. దేవాలయం ఖంగున ప్రతిధ్వనించింది.

గరటయ్య ఆనందంతో చిరునవ్వు నవ్వుతూ, చలికి గడగడ వణుకుతూ, చాలీ చాలని తుండుగుడ్డ సవరించుకుంటూ, దేవాలయంలోకి మెల్లగా వస్తూ, "రాండ్రా నాయనా" అని పిల్లలందర్నీ పిల్చాడు.

మాధవశాస్త్రి గరటయ్య దగ్గరకు వచ్చి "కాదు గరటయ్యా — ఎందుకు నువ్వు అక్కడే నిల్చున్నావు? ఇప్పుడు చటం మారిపోయింది. గాంధీమహాత్ముని దయవల్ల, అందరం ఒకటైపోయినాము" అన్నాడు.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారు, పూజారీ, మటమటలాడుతూ మాధవశాస్త్రిగారిని ఒక సారి చూశారు.

మాధవశాస్త్రిగారి మాటలకు గరటయ్య ఏమీ జవాబు చెప్పకుండా, మనసులోనే మహాత్ముణ్ణి స్మరించుకొని నమస్కారంచేసి కళ్లుమూసుకున్నాడు.

పూజారిగారు హారతి వెలిగించి మంత్రాలు

చదవడం ప్రారంభించాడు. పాపం పూజారి వీరభద్రయ్యకు నాలుక చాలా లావు. అందువల్ల ఆయన గర్భగుడిలో చేరి మంత్రాలు చదువుతుంటే, నోట్లో నిమ్మకాయ పెట్టుకొని అరిచినట్లుంటుంది. ఆ మంత్రాలు ఏ మహానుభావులు వ్రాశారో, ఏ మహర్షులు సృష్టించారో, అవి స్పష్టంగా ఉచ్చరించితే ఆ శబ్ద సౌందర్యం శ్రోతలను ముగ్ధుల్ని చేస్తుంది. కాని వీరభద్రయ్య 'మణుగు నాలుక' వాడు కావడంచేత, ఆ మంత్రాల్లో ఉన్న శబ్దసౌందర్యాన్ని తన ఉచ్చారణతో హత్యచేసేవాడు.

హారతిపళ్లెం చేతబట్టుకొని పూజారి అందరినీ చూచి, "మాధవయ్యా! మళ్ళీ ఇంకోసారి గంట కొట్టూ" అన్నాడు.

గంటకొట్టిన పది నిమిషాలకు దేవాలయం జనంతో నిండిపోయింది.

గెరటయ్య, అతనితో కూడా వచ్చిన పిల్లలు, అందరికన్నా ఆఖరునపోయి నిల్చున్నారు. పూజారి ఒక ముద్ద కర్పూరం మళ్లీ ముట్టించి, లోపలలోపల మంత్రాలు చదువుతూ వచ్చి అందరికీ హారతి అందిచ్చాడు.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారు ఒక అణా పళ్లెంలో వేశాడు. మాధవశాస్త్రిగారు ఒక అర్ధణా వేశాడు. మిగిలిన గ్రామస్థులలో కొంతమంది పెద్దమనుషులు కానీలు అర్ధణాలు వేశారు. గెరటయ్య కొంగున కట్టుకున్న కాని విప్పి చేతులో పట్టుకున్నాడు. పూజారి గెరటయ్యదగ్గరికి రానేలేదు దూరాన్నుండే హారతి కళ్ళకద్దుకొని సంతృప్తి పడ్డాడు గెరటయ్య.

డబ్బుతో నిండిన హారతిపళ్లెం చూచుకొని సంతోషపడి, పూజారి ప్రసాదంపళ్లెం చేతికి తీసుకున్నాడు. చేతినిండా తీసి మొట్టమొదట ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారికి పెట్టాడు. తర్వాత మాధవశాస్త్రిగారికి పెట్టి, వరుసగా పెద్దవాళ్లందరికీ ప్రసాదం పెట్టాడు. గెరటయ్య ఆఖరున నిల్చొని ఉన్నాడు. పూజారి గెరటయ్యను నిర్లక్ష్యంగా ఒకసారి చూచి, "ఒరేయ్, నిల్చోండ్రా. అందరూ వరుసగా నిల్చోండి" అన్నాడు.

పిల్లలందరూ ఒకరొకరు తోసుకుంటూ పాటో చేతులు పైకెత్తి, "స్వామీ, అశ్వామీ" అని అరవడం ప్రారంభించారు.

దేవాలయంలో ప్రతిధ్వని ఎక్కువ కావడంవల్ల, వాళ్ల అరుపులు పదిరెట్లుగా మారుమోగుతూ, లక్షలాది ప్రజానీకం "ఆకలి, ఆకలి" అని అరిస్తే ఎంత హృదయవిదారకంగా ఉంటుందో, ఆ పసిపిల్లల అరుపులు అంత దీనంగా ఉన్నాయి.

పిల్లలందరు పూజారిని చుట్టుముట్టేశారు. పూజారి నాలుగు మెతుకులు పులుసన్నం, ఒక్కొక్కరి చేతుల్లో వేస్తూ, పిల్లల్ని తిడుతూ, విసుక్కుంటున్నాడు.

మాధవశాస్త్రి, తన చేతులోని పులిహోర తినకుండా అలాగే ఆ దృశ్యాన్ని చూస్తూ నిల్చున్నాడు. ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారు ప్రసాదం తినేసి చేతులు కడుక్కోవడానికి వెళ్ళి తిరిగి రానేలేదు.

పూజారి చుట్టూ పిల్లలగుంపు చేరి "స్వామీ, నాకు పెట్టలేదు, నాకు పెట్టలేదు" అని అరుస్తూ చేతులు జాపుతున్నారు.

పూజారి వీరావేశంతో ఒక పసిబాలుణ్ణి ఛెళ్లున వీపుమీద ఒక దెబ్బవేసి, గుడ్లు మిటకరించి చూచి "వెధవా. ఎన్నిసార్లురా నీకు పెట్టేది?" దబాయించాడు.

ఆ పసివాడు బావురుమని ఏడ్చాడు. అతని ఏడుపు దేవునికి వినిపించే ఉంటుంది. దేవాలయం జాలిగా మార్మోగింది.

మాధవశాస్త్రిగారి ముఖం కోపంతో కందిపోయింది. "భద్రయ్యా! ఏమిటా పని...?" అని ముఖం చిట్లించి చూశాడు.

"మాధవయ్యా, మాలవెధవ, ఒకసారి పెట్టించుకొని మళ్లీ చెయ్యిజాపుతున్నాడు" అని వీరభద్రయ్య వీరావేశంతో అన్నాడు.

గెరటయ్య జాలిగా నవ్వి, "ఒరే నాయనా ఎందుకురా ఆ బతుకు? ఒకసారి పెట్టించుకొని మళ్ళీ చెయ్యిజాపి, ఆ కడుపుకు తినకుంటే ఏమిరా? నాలుగు మెతుకులు పులుసన్నం కోసం తన్నులు తినాల్రా?" అని ఆ పసివాణ్ణి మందలిస్తూ చూచాడు. ఆ బాలుడు బావురుమని ఏడుస్తూ—

"లేదు తాతయ్యా, నాకు పెట్టలేదు" అన్నాడు.

"ఛీ. వెధవా, అబద్ధాలు చెప్తావా? పెట్టలేదూ నీకు? ఎన్నెన్ని పాపాలు చేసో ఈ జన్మలో ఇలా పుట్టావ్. ఎందుకురా ఇంకా అబద్ధాలతో కడుపు నింపుకోవడం?" అని తను సత్యహరిశ్చంద్రుడి వారసుడయినట్లు ఠీవిగా నిల్చున్నాడు పూజారి.

గెరటయ్యకు ఒళ్లు భగ్గున మండింది.

"స్వాములూ! తమరు కొంచెం నెమ్మదిగా మాట్లాడితే బాగుంటుంది" అన్నాడు.

పూజారి ఉగ్రుడైపోయి, "ఏమిట్రోయ్, ఏంచేస్తావోయ్ నువ్వు? ఏమో బలే వత్తాసి కొస్తున్నావే!" అని గెరటయ్యను దబాయించాడు.

మాధవశాస్త్రి ఆవేశంతో గబగబా వచ్చి తన చేతులోని పులుసన్నం ఏడుస్తున్న బాలుడి చేతినిండా పెట్టి, వీరభద్రయ్య చేతిలోని పళ్లెం గబాలున లాక్కొని,

"అందరూ వరుసగా నిల్చోండి నాయనా" అన్నాడు మాధవశాస్త్రిగారి ఆవేశం చూచి వీరభద్రయ్య పిల్లిలాగా నిల్చున్నాడు. గెరటయ్య ఆశ్చర్యంతో ఏమి జరుగుతుందోనని ఎగిరిచూస్తున్నాడు. మాధవశాస్త్రి చేతినిండా పులుసన్నం తీసి ముందు గెరటయ్యచేతిలో పెట్టాడు. ఆయన ముఖం సంతృప్తితో వికసించింది. ప్రసాదం కళ్లద్దుకున్నాడు గెరటయ్య. మాధవశాస్త్రిగారు చేతినిండా పులుసన్నం తీసి అందరికీ పంచిపెడుతుంటే పూజారిగారి ప్రాణం గిజగిజ లాడిపోతూ ఉంది.

పళ్లెం ఖాళీ అయిపోయింది.

"భద్రయ్యా! కొంచెం పులుసన్నం తీసుకరాపో" అన్నాడు మాధవశాస్త్రి.

"ఇంకెక్కడుందయ్యా? కొద్ది కొద్దిగా పెడితే అందరికీ సరిపోయుండేది. తమరు ఒక్కొక్కరికి దోసెడు దోసెడు పెడితే ఎంతయితే మాత్రం అవుతుందా?" అన్నాడు పూజారి.

"పోనీవయ్య స్వామీ. ఇంటికి పోయి కొంచెం తీసుకురాపో" అని పళ్లెం అందించాడు మాధవయ్య.

"ఇంకెక్కడుంది మాధవయ్యా?" అన్నాడు పూజారి.

"కుంచెడు బియ్యం పులుసన్నం యికేనా?" అని మాధవశాస్త్రి కోపంతో చూచాడు.

పూజారి ముఖం వెలవెలబోయింది.

"ఏమిటి మాధవయ్యా! ఏమో కొత్తగా మాట్లాడుతున్నావు గదయ్యా నేనేమైనా మింగుతానా?" అన్నాడు.

ఏమి జరుగుతుందోనని, ప్రసాదంకోసం ఎగిరిచూస్తున్న మనుషులు కాచుకొని ఉన్నారు. పూజారి పళ్లెం చేతికి తీసుకొని వెళ్లి కొద్దిగా పులుసన్నం తీసుకొచ్చాడు.

మాధవశాస్త్రి పళ్లెం అందుకోబోయాడు. పూజారి యివ్వలేదు. "నీవు పెడితే అందరికీ చాలదు మాధవయ్యా! ఉన్నదంతా ఒక్కరికే తోసేస్తే నే నెక్కడ పోసుకొచ్చేది?" అన్నాడు పూజారి

మాధవయ్య ఒక్క విసురున పళ్లెం చేతిలో లాక్కొని అందరికీ పంచిపెట్టేశాడు.

పూజారి అవమానంతో ముఖం మాడ్చుకుని రొప్పుతూ గోడ ప్రతిమలాగా చూస్తూ నిల్చున్నాడు.

గెరటయ్య భగవంతునికి నమస్కారం చేసి, మాధవశాస్త్రిగారిదగ్గర సెలవు తీసుకొని, పిల్లలందర్నీ వెంటబెట్టుకొని వెళ్లాడు. దేవాలయం ఖాళీఅయింది.

పూజారి మాధవశాస్త్రిగారిని కొరకొర చూచి "తమరు చేసిన పని ఏమీ సమంజసంగా లేదు స్వామీ" అన్నాడు.

మాధవయ్య బలవంతంగా చిరునవ్వు నవ్వి, "అది కాదు భద్రయ్యా. నువ్వ

# మనుషులూ...మనసులూ!

## వై. రఘునాథరావు

ఇంపీరియల్ బాంకు గుమాస్తా శంకరం ఇంటికి బయలుదేరేడు. ఆ నాడే జీతం అందింది. ఆఫీసు గేటుదగ్గరే కాచిన కాబూలీవాడి చేతులో తను వాడిదగ్గర చేసిన అయిదువందల రూపాయల అప్పు తాలూకు నెల వడ్డీ ఏభై రూపాయలూ పోసేడు. ఆ అప్పు ఎన్ని నెలల క్రితం చేసేడో తన కిప్పుడు జ్ఞాపకం లేదు. కుట్టు తెగిన చెప్పుల్ని ఈడ్చుకుంటూ ముందుకి సాగేడు. మధ్యాహ్నం ఎండవేడికి కరిగిన రోడ్డుమీద తారు ఇంకా గట్టిపడలేదు. భాపురం బజారులోని జమ్ములవారి కొట్లో కాతా జమకట్టి తిన్నగా మలబారు హోటల్లోకి పోయి కాఫీ ఆర్డరిచ్చేడు. అప్పుడే విజయా టాకీస్‌లోని ఇంగ్లీషుమాటినీ సినిమా వదిలేరు. నిమిషంలో హోటలంతా నిండి చాలా సందడిగా ఉంది. సాధారణంగా శంకరం హోటల్లోకి పోడు. ఒక వేళ అలా ఎప్పుడైనా వెళ్ళినా వాటి వాతావరణాన్నీ అక్కడ తృప్తిగా, సుష్టుగా ఫలహారాలు చేసే జన సమూహాన్నీ చూడగానే ఒకరకమైన జుగుప్స, ఉడుకుమోతుతనం వేసి బయటకొచ్చేస్తాడు.

ఆరేళ్ళ క్రితం తనూ ఈ సందోహంలో ఒకడుగా ఉండేవాడు. ఇప్పుడా ఆరేళ్ళ కాలపరిమితీ ఎంతో దూరంగా కనిపిస్తుంది. ఈమధ్యలో తనకీ ఈ మందకీ మధ్య ఒక గట్టి గాజుగోడ కాలం కట్టేసింది. ఆ రోజుల్లో స్నేహితులెవరైనా సిజర్సు సిగరెట్టు offer చేస్తే "క్షమించాలి. గోల్డు ఫ్లాక్ తప్ప మరో సిగరెట్టు కాల్చలేను తమ్ముడూ" అనేవాడు. ఇప్పుడు చార్‌మినార్ ఇచ్చినా వద్దనడు. అప్పుడు హోటల్లో కూర్చోవడమే తడవు తనని అడక్కుండానే సెర్వరు టేబిలంతా ప్లేట్లతో నింపేసేవాడు. ఈనాడో...! ఇలా ఎన్నని తలచుకోగలడు? కాఫీ పూర్తిచేసి చరచరా బయటకి నడిచేడు. ఖాళీ కడుపుమీద కాఫీ బాగా పనిచేసినట్టుంది—పార్కు చేరేసరికి ఒళ్ళంతా చెమటపటింది.

ఎందుకో ఆనాడు అంత వేగంగా ఇంటికి వెళ్ళాలని బుద్ధిపుట్టడం లేదు. తాపీగా పార్కులోకి పోయి ఒక బెంచీమీద నడుం వాల్చేడు. బెంచీ ఇంకా వేడిగానే ఉంది. రామలింగం చెరువుమీదినుంచి వచ్చే వెచ్చటి గాలికి వెలిగించిన అగ్గిపుల్లలు మూడు సార్లు ఆరిపోయేయి. చివరకి ఎలాగో సిగరెట్టు ముట్టించి మూడు దమ్ములు గుండెలోకి లాగేడు. వగలుతున్న సిగరెట్టు పొగలో శంకరం తండ్రి ఆకారం మసకగా మసిలింది.

"నేను ఆనాడే చెప్పలేదురా వెలుతురుండగానే ఇల్లు చక్కబెట్టుకోమని!" అన్నదా ఆకారం.

"నాకేం తెలుసు? చీకటి పడినా దీపం వెలిగించుకోవచ్చు అనుకున్నా" అన్నాడు శంకరం.

"దీపంలో చమురు లేదని నీకు తెలీదూ?" అన్నది ఆకారం.

"నాకెలా తెలుస్తుంది? అయినా కన్నతండ్రే నన్నిలా అన్యాయం చేస్తాడని నే నెప్పుడేనా భావించేనా? అసలు నిన్ను చూస్తే నా అరికాలునుంచి నెత్తికెక్కుతుంది. వెళ్ళిపో" అని శంకరం ఒక పెద్ద సిగరెట్టుదమ్ముతో ఆకారాన్ని Shoot చేసేడు. ఆకారం చెల్లాచెదరైపోయింది. మళ్ళీ శంకరం ఒక్కడే మిగిలేడు. అన్నట్టు మరచిపోయేను. పార్కు బెంచీకూడా ఉంది. శంకరం బెంచీతో ఇలా చెప్పుకున్నాడు.

"మా డీ పెద్దమనిషి! ఇతడు నా తండ్రి. ఈ బరంపురంలో ఇతడికి ఎంత పలుకుబడి ఉండేదంటే ఇతని ఆస్తిపాస్తులు విచారించకుండానే ఈ షౌకారువాళ్ళు మొత్తం ఏభై వేల రూపాయల అప్పు ఇచ్చేరు. ఇంత ఘరానాగా ఈయన చెలామణీ అవబట్టే ఆ ధైర్యంతో నేను ఇంటర్మీడియట్ మూడు సార్లు తప్పేను. ఇందులో నా తప్పేముంది? ఈ హోదా చూసే నా మామగారు తన ఎనమండుగురు కుమార్తెల్లో పెద్దదాన్ని నాకిచ్చి మహా వైభవోపేతంగా వివాహంచేసి మర్నాడు దివాలా ఎత్తేరు. ఈ అమావాసుకునే నాభార్య అందర్నీ ఆడపిల్లల్నే కనేసింది. ఒక సుప్రభాతాన ఈయన హఠాత్తుగా తనువు చాలించేరు. ఊరంతా ఒక్కసారి గుప్పుమంది. నా బాబు పరామర్శకి చేరినవాళ్ళలో బంధువులూ, స్నేహితులూ కలిపి అప్పులవాళ్ళలో సగమేనా లేరు..."

పార్కు బెంచీకి వళ్ళు జల్లుమని ఒక్కసారి చల్లగా అయిపోయింది. "తర్వాత కథ మరి చెప్పకు. నేనంతా ఊహించుకున్నాను" అన్నది బెంచీ.

శంకరం ఒక నిట్టూర్పు విడిచి జేబురుమాలు తీసి ముఖం తుడుచుకున్నాడు.

---

మాట్లాడిన మాటలకు వెంకట్రాముడే గనక అయ్యుంటే మన గతి ఏమైఉండేదో! గరటయ్య కొంచెం సాధువుగాబట్టి సరిపోయింది" అన్నాడు.

"సరే మాధవయ్యా. పులుసన్నం తీసుకరా తీసుకరా అన్నావే గానీ, నేనేం మింగుతానా? ధర్మకర్తలకు అయిదుగురికీ ఇళ్ళకు పంపించాలి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు గారికి పంపించాలి. మీకూ పంపాలి. 'ముంచెడు బియ్యపు పులుసన్నం ఇదేనా?' అని అంతమందిముందు నన్నడిగేవే! ఔరా! ఎంత మాటన్నావు మాధవయ్యా! నీ వట్లా మాట్లాడతావని నే కల్లోకూడా అనుకోలేదు" అన్నాడు పూజారి.

"మాధవయ్య పకపకా నవ్వి సరే భద్రయ్యా, నువ్వు ఆ అబ్బాయిని వీపుమీద దబాలున బాదేసరికి నాకు కోపమొచ్చింది. పిల్లకుంకలు; వాళ్ళ మీద కోప్పడితే ఏమయినా లాభమా? పక్కన గరటయ్య ఉన్నాకూడా ఆ పిల్లల్ని తిడుతుంటే, గరటయ్య కాబట్టి ఓర్చుకొన్నాడు కాని, వెంకట్రాముడే అయితే ఆ పులుసన్నంపళ్లెం చేతికి తీసుకొని, విసిరి ముఖాన కొట్టిఉండేవాడు." అన్నాడు మాధవయ్య.

వీరభద్రయ్య వీరావేశంతో కళ్లురిమి, "వాడివల్ల అవుతుందా? రెడ్డిగారి ధర్మాన బతికే వెధవలు, మనల్నేం చేస్తారయ్యా?" అని ధీరుశీలాగా అంటూ పూజారి ఒళ్ళ గోచీ సవరించుకొని దేవాలయానికి భద్రంగా తాళాలు వేశాడు.

మాధవశాస్త్రి ధ్వజస్తంభాన్ని చూస్తూ కొంతసేపు నిల్చున్నాడు. ధ్వజస్తంభం పైని చిరుగంటలు గణగణ మోగుతూ ఆకాశంలో సంగీతం ఆలపిస్తున్నాయి.

దేవాలయగోపురం మీద కాపురం చేస్తున్న పావురాళ్లు, తటతట రెక్కలు కొట్టుకుంటూ పెనుగులాడుతున్నాయి. మాధవశాస్త్రి పసిబాలుడిలాగా నిల్చొని గాలిగోపురంపై బొమ్మల్ని కొంతసేపు చూచి ఇంటికెళ్లాడు.

(ఇంకావుంది)

#  మనుషంలా... మనసులా! 

ఎదురుగా పచ్చికలో పాపాయిలంతా కేక లేస్తూ ఆడుకుంటున్నారు. క్రమంగా బెంచీలన్నీ నిండుతున్నాయి. సిలోన్ స్టేషన్ హిందీ సినిమా సంగీతం లౌడ్‌స్పీకర్‌లోంచి ప్రసారమౌతోంది. సీతారామ విలాస్ టాకీస్‌కి మొదటి ఆటకి జనం గుంపులు గుంపులుగా పోతున్నారు శంకరం లేచేడు.

అతడింటికి చేరేసరికి బాగా చీకటి పడింది. అరుగుమీద మూడో కూతురు తీరికగా కూర్చుని ఏడుస్తోంది. తండ్రిని చూసి శ్రుతిని మరో మెట్టుమీదికెత్తింది. "ఊరుకున్నావా లేదే జన్మముండా" అంటూ ఒక అప్పడాల కర్రను ఎడంచేత్తో పట్టుకొని గబగబా లోపలినుంచి బయటికొచ్చింది అతడి భార్య. శంకరాన్ని చూడగానే కొరకొరలాడుతూ, గొణుక్కుంటూ ఇంట్లోకి వెళ్ళిపోయింది. శంకరం కూతుర్ని ఎత్తుకున్నాడు. కూతురు తల్లిమీద ఇరవై నేరాలు నాన్నతో రిపోర్టుచేసింది. శంకరం దీనికి పంచాయతీ జరుపుతానని చెప్పి సరాసరి వంటఇంటి దగ్గరికి వెళ్ళేడు.

"రోజూ నేను ఆఫీసునించి వచ్చేవేళకి దీన్ని ఏడిపిస్తూఉంటా వెందుకూ?" అన్నాడు.

"నా కదో సరదా" అందామె.

"అదిగో. అలా అంటే ఇలా అంటావు. అసలే చిన్నపిల్లలు. జ్ఞానం ఉండదు. వాళ్ళతో నీ కెందుకా కీచులాట?"

"జ్ఞానంలేని వెధవలు జ్ఞానం లేనట్టుండాలి. చంటిదానికి నిన్నటినుంచీ జ్వరం తగులుతోంది. నిన్న రాత్రల్లా దానికి నిద్ర లేదు. నాకు నిద్ర లేదు. ఇవాళ పగలంతా ఏడుస్తూనే ఉంది. భోజనాలన్నీ అయిం తర్వాత కాసేపు నడుం వాల్చేను. అప్పుడే అదికూడా పడుక్కుంది. ఇంతలో ఇది గదిలోకొచ్చి ఒకటే గోల. "చెల్లి లేచిపోతుంది. గోల చెయ్యకే" అన్నాను. బతిమాలుకున్నాను. సాయంత్రం నాన్న వచ్చిన తర్వాత జిలేబీ కొనిపెడతా నన్నాను. నాకూ కాస్త నిద్రపట్టనిచ్చి ఆమధ్య అమ్మవారిసంబరాల్లో మీరుకొన్న బూరాని చంటిదానిచెవిలో పెట్టి గట్టిగా ఊదింది. అదొక్క కేక పెట్టింది. నాకు తెలివొచ్చి దీని మామూలు వాలుగా చెల్లించేసేను. అది పుచ్చుకు ఇల్లల్లా ఎగరగొడుతూ, ఏడుస్తూ వీధిలోకి పోయింది. ఆ కోపం మనసులో ఉంచుకొందిగాబోలు - ఇందాకల ఆ చంటిదొక్కత్తీ గదిలో ఆడుకుంటుంటే అక్కడికివెళ్లి మరేంచేసిందో అది పెద్దపెట్టున రాగాలు మళ్ళీ లంకించుకుంది."

శంకరంభార్యకి ఒక్కసారి కోపం ఉబికింది. "నిన్నా!" అని మళ్లీ అప్పడాల కర్రచ్చుకుంది. "నాన్నా!" అని బావురుమని శంకరం మెడ పెనవేసింది మూడోది.

"అబ్బ. ఊరుకోవే! నేనున్నాగా! అమ్మ నిన్నేం చెయ్యదులే!" అంటూ "కాఫీ ఇస్తావా?" అన్నాడు భార్యతో.

"ఇంట్లో పంచదార నిండుకుందని నిన్ననేగా చెప్పేను. తీసుకొచ్చేరా?" అందామె.

"మర్చిపోయేనుసుమా. ఏదో ఈపూటకి పొరుగువాళ్లింటికెళ్లి తీసుకు రద్దూ". అన్నాడు.

"అవును. మీ కెందుకు జ్ఞాపకం ఉంటుంది? అసలు మీకీయిల్లు, సంసారం అవసరం ఉంటేగా? ఇవాళ ఒకటోతారీఖు గదా అని నరసమ్మగారితో మొదటిఆట సినీమాకి వెళతానన్నాను. ఆవిడ నిండా కలదాకా మీరాకకోసం చూసిచూసి వెళ్ళిపోయింది."

"ఇవాళ పొద్దున్న నువ్వు నాతో ఏమీ చెప్పందీ నువ్వు సినీమాకి వెళతావని నేనెలా అనుకోను?"

"మీరు రోజూ ఈవేళకే ఇంటికి వస్తున్నారా?"

"రోజూ ఒకేవేళకి ఇంటికి రావాలని ఎక్కడుంది? ఇంతకీ ఆ దిక్కుమాలిన సినీమాకి రేపు పోరాదూ?"

"సినీమా దిక్కుమాలిన దెందుకౌతుంది లెండి! సరూ, సరూ! ఎక్కడున్నావే?"

"వస్తున్నా అమ్మా."

"అలా దబ్బున వదినగారింటికెళ్ళి తల కొట్టి సోలడు పంచదార అరువుపట్రా."

"అలాగే."

"నా బ్రతుకంతా ఇలా అరువులతోనే తెల్లవారేటట్టుంది." అని గొణుక్కుందామె.

"ఎందుకలా ఊరికే గొణుక్కుంటావ్? ఈ సంసారభారమంతా మహా నువ్వొక్కర్తివే మోస్తున్నట్టు?" అన్నా డతడు.

"నిజమే. మీకుభారమైపోతే మొయ్యడం కష్టమనే మీ నాన్నగారు అంతా చులకన చేసేసి వెళ్ళిపోయేరు."

సగం కాలినసిగరెట్టుని ఒక్కసారి నడవలోకి విసిరేసేడు.

"నోర్ముయ్ మా నాన్నగారి పేరెత్తేవంటే పళ్ళు రాల్తాయి."

"ఉన్నమాటంటే అంత ఉలుకెందుకు?"

"చీటికీ మాటికీ మా నాన్న పేరెత్తుతా వెందుకు? మీ నాన్న మహా నిర్వాకం చేసినట్టు!"

"మా నాన్న మీకేం తక్కువ చేసేరు? ఐదు వేల రూపాయల కట్నం మీకు ధార పోసేసేరు!"

"ధారపోసేడు మహా! ఆ సొమ్ముతో నిన్ను నాకంటగట్టలేదూ?"

ఆమె నిశ్చేష్టురాలైపోయింది. "నేను మీకు అంత కంటకప్రాయంగా ఉన్నా నన్నమాట. నాకు చావేనా రాదెందుకో!"

"ఎలా వస్తుంది? నా ప్రాణానికి ఈ నలుగురాడసంతానంతో నీ ఉమ్ము తగల్చడానికి రాసిఉంటే."

"ఇదిగోటే అమ్మా పంచదార!"

శంకరం భార్య చీరచెంగు నోట్లో గుచ్చుకుంటూ కాఫీచేసి దగ్గర్లో పెట్టి వంటింట్లోకి పోయింది. కాఫీ తాగి కూరలసంచీ చేతితో పట్టుకొని బజారుకి బయలుదేరేడు అతడు.

రుసరుసలాడుతూనే రాత్రి భోజనానికి కూర్చున్నాడు. "నాన్నతో నేనూ భోంచేస్తా" అంటూ మూడో కూతురు పరుగెత్తుకుంటూ వచ్చి శంకరం వొళ్లో కూర్చుంది. ఆ కూర్చోవడంలో పక్కనున్న మంచినీళ్ళగ్లాసుకి ఒక్క తాపు తగిలింది. గ్లాసులో నీళ్లన్నీ కంచంలోకి వలికేయి. కూర్చున్నదాన్ని ఒక్క గుంజు గుంజి వీపుమీద గట్టిగా నాలుగు వేస్కా అంటించేడు. "బా"మని అది ఆరంభించింది. పావు గంటయి తనని ఎవరూ ఏడిపించడం లేదని చంటిపిల్ల కూడా దీనికి శ్రుతి కలిపింది. సావిట్లో పెద్ద అమ్మాయి, రెండోదీ ఏదో పెద్దగా ఘర్షణ పడుతూ అరుస్తున్నారు. ఇంటిల్లిపాదీ ఒక్కసారిగా ఏదో కుట్ర పన్ని తనని ఏడిపిస్తున్నట్టుంది.

"ఊరుకో అమ్మా ఊరుకో. చేతకాని వాళ్లకి పౌరుషం లావట. మీ నాన్నగారి కోపతాపాలు తీర్చడానికి మనమే ఎప్పుడూ కనిపిస్తూంటాం" అని ఓదార్చిందావిడ మూడో అమ్మాయిని.

"నేనంత చేతకానివాణ్ణని నువ్వనుకున్నప్పుడు ఇక్కడ అఘోరించడం ఎందుకు? మీ పుట్టింటికి పోయి చావరాదూ?"

"చావడానికి పుట్టిల్లెందుకు? ఆ చావంతా ఇక్కడే అవుతోంది."

"నిజమే. నీతో కాపురంచేస్తున్నాన్నాళ్లూ నాకూ నిత్య చావు అవుతోంది. ఇలా రోజూ చచ్చి బతికేకంటే ఏకంగా నేచస్తే మేలు" అంటూ లేచేడు.

"అలా భోజనాలదగ్గర మీరు లేచి వెళ్ళిపోయేరంటే నేను ఉరెట్టుకుంటాను."

వెళిపోతున్నవాడల్లా గబగబా వెనక్కి వచ్చి ఆమె నోతాపు తన్నేడు. ఆమె ంద

పడిపోయింది. "ఇలాగ రోజూ నన్ను వేధిస్తున్నావు చస్తాను చస్తాను అంటూ. ఏం ఉరేట్టుకుంటావో ఉరేట్టుకో, నేనూ ఏ రైలుకిందనోపడి చస్తాను. అక్కడితో ఈ లోకానికి ఇద్దరి పీడా వదుల్తుంది." తోవ కడ్డుపడ్డ ఇద్దరు పెద్దకూతుళ్ళనీ పక్కకి జోరుగా నెట్టి వీధితలుపు భళేల్మని వేసి రోడ్డుమీదికి చరచరా వచ్చేసేడు శంకరం.

తన ఆత్మకి శాంతి, విశ్రాంతి ఏనాడో దూరమయేయి. ఆరోజు జీవితమే దుర్భరమైంది. ఇన్నాళ్లూ ఎలాగో నెట్టుకొస్తున్నాడు ఈ దయ్యాల కొంపని. నేటితో దానికీ తనకీ ఋణం తీరిపోయింది. వీధి మలుపుదగ్గర ఆగి సిగరెట్టు ముట్టించుకుని మళ్ళీ ముందుకు సాగేడు. సినీమాహాలు దగ్గర చాలా సందడిగా ఉంది. అప్పుడే "విశ్రాంతి" ఇచ్చేరు గాబోలు ఎదురుగా జయలక్ష్మీ విలాస్ కాఫీహోటలు కనిపిస్తోంది. లోనికి పోయి ఒక అరకప్పు విషం ఆర్డరు ఇస్తే! గొంతుక పూరేదాకా ఉప్మా తిని ఊపిరాడకుండా ప్రాణాలు వదిలేస్తే!

అలా ఆలోచిస్తూనే రామలింగం చెరువు దాకా వచ్చేసేడు. అక్కడ ఆగి ఇటూ అటూ చూసేడు. రావిచెట్టు నీడలో పిచ్చి బైరాగి తల ఆడించుకుంటూ కూర్చున్నాడు. కొద్ది దూరంలో ఓ శ్రీమంగలి బెంచీమీద పడుకున్న ఒక ఆసామీకి కాళ్లు పిసుకుతున్నాడు. రూరాన నలుగురు కాలేజీ కుర్రాళ్లు బాతాఖానీ వేసేరు. తనవైపు వీపు తిప్పి నీటిలో విసిరిన చేపల గాలంవైపు తదేకంగా చూస్తున్నాడు ఒక గళ్లలుంగీ మనిషి. మరెవ్వరూ లేరు. శంకరం పళ్లు గట్టిగా బిగబట్టి గబగబా పావంచాల చివరకి నడిచేడు.

"ఏమండోయ్! అదేమిటలా గుడ్డలతోనే నీళ్లోకి దిగుతున్నారు? అక్కడ పాకుంది. జారుతారు జాగ్రత్త!"

తక్కున ఆగిపోయేయి కాళ్లు. సిమెంటు బెంచీవారను ఒక్క లంగోటాయే కట్టుకుని వంటినిండా నీరోడుతూ ఒకతను - అప్పుడే ఈత కొట్టివచ్చినట్టున్నాడు - అలసట తీర్చుకుంటున్నాడు. శంకరం ముందుకు వంగి దోసిలితో నీళ్లెత్తి మొగం కడుక్కుని నెమ్మదిగా వెనక్కి తిరిగి రోడ్డుమీదికొచ్చేసేడు.

"ఛీ! పాడు మనుషులు. ప్రశాంతంగా చద్దామన్నా చావనివ్వరు గదా!" అని తిట్టుకుంది శంకరం మనస్సు. పార్కులోంచి అప్పుడే వస్తూన్న గోపాలరావు శంకరాన్ని కేకేసేడు. వినిపించుకోనట్టే ముందుకు సాగేడు తను. కాని గోపాలరావు అంత సులువుగా వదిలే రకం కాదు. "ఒరే శంకరం! ఎక్కడికిరా ఇలా బయలుదేరేవు?"

"అలా బాబ్జీని ఒకసారి కలుసుకుందామని."

"అయితే పద. నేనూ అటే వస్తున్నా."

తెలుగుభాషలో ఎన్ని బూతులున్నాయో అన్నిటితోనూ తిట్టింది శంకరం మనస్సు.

"ఒరే బ్రదర్! ఒక పదిరూపాయలుంటే ఇస్తావ్?"

"లేవు."

"ఇవాళే నీకు జీతం అందింది కదరా?"

"నీకు మాత్రం అందలేదూ?"

"నాకూ నీకూ ఒకటే? గంపెడు సంసారం నాది. అంతా కలిపి నలుగురు నిండు మనుషులైనా లేరు మీ ఇంట్లో. మళ్లీ పదోతారీఖున ఇచ్చేస్తానురా"

"ఒరే అప్పు పుచ్చుకున్నవాడు తీరుస్తాడంటే నేను నమ్ముతానూ? నేను అప్పు చేసినవాళ్ళలో ఒకరికైనా సొమ్ము తీర్చిన పాపాన పోయేనూ? లేదురా తమ్ముడూ, మన గుమాస్తా బ్రతుకులకి అప్పు ఇవ్వడం గాని, చేసిన అప్పు తీర్చడం గాని ఎప్పుడూ ఆచారం కాదు."

"సాయంత్రంనించి ఊరల్లా తిరుగుతున్నాను. ఎక్కడా కిట్టలేదురా. ఇలా అయితే జీవించడం ఎలా?"

"నిజమే! జీవించడం ఎలా?"

"ఒరే శంకరం! ఒక్కొక్కప్పుడు ఇలా జంతువుల్లా జీవించేకంటే చస్తేనే మేలనిపిస్తుందిరా."

"ఒకొక్కప్పుడేమిటి? నాకు నిత్యమూ అలాగే అనిపిస్తుంటుంది."

"అయితే శంకరం! మనలాటి ఎందుకూ పనికిమాలిన వెధవలం ఎందుకు చావకూడదు?"

"సరిగ్గా చెప్పేవు. నేనూ ఇవాళ ఆ నిశ్చయానికే వచ్చేను. పద స్టేషన్‌కి."

"స్టేషన్‌కా. దేనికి?"

"కోటపేట లెవెల్ క్రాసింగ్ దగ్గర ఎవ్వరూ ఉండరు. అమావాస్యరాత్రిళ్లు. నాకు నువ్వు సాయం! నీకు నేను సాయం!"

"దేనికిరా?"

"ఒరే దవటా! రైలుకింద బుర్ర పెట్టి చావడానికి. దేనికని అడుగుతావేమిటి దద్దమ్మలాగు?"

నడుస్తున్నవాడల్లా బస్సుస్టాండ్ దగ్గర ఒక్కసారిగా ఆగిపోయాడు గోపాలరావు. జేబు రుమాలు తీసి చెమటపట్టిన ముఖాన్ని తుడుచుకున్నాడు.

"సోడా తాగుదాం రా" అన్నాడు. ఇద్దరూ రెండు సోడాలు తాగి, రెండుకిళ్లీలు వేసుకుని, రెండు సిగరెట్లు ముట్టించేరు.

"వస్తానురా" అన్నాడు గోపాలరావు.

"స్టేషన్‌కి రావూ?"

"ఊహు! మా చంటిదాన్ని ఇప్పుడు డాక్టరు ప్రకాశరావుదగ్గరికి తీసుకెళ్లాలి. దానికి మూడు రోజులైంది జ్వరం తగ్గడం లేదురా?"

"నీ భార్యకి ఏమీ కాలేదూ?"

"అరె! వేళకి జ్ఞాపకం చేసేవు. ఇవాళ దాని పుట్టినదినం. ఖర్జూరం అంటే దానికెంతో ఇష్టం - ఆ సంగతే మర్చిపోయేను. థాంక్స్. వెరీ మెనీ థాంక్స్. అలా పళ్ళ దుకాణానికి వెళదాం వస్తావూ?"

"ఊహు! నాకు కోర్టులో కొంచెం పనుంది." ఈ మాట కొంచెం నొక్కుతూ అన్నాడు శంకరం. "సరే. సరే. గుడ్ నైట్!" - గోపాలరావు చరచరా రంగం నుంచి నిష్క్రమణ—

మళ్ళీ శంకరం ఒక్కడే మిగిలేడు. "భార్యా, పిల్లలూ! హు!" అని శంకరం మనస్సు హూంకరించి "పదండి. ఇక్కడెందుకూ?" అంది కాళ్లని. కాళ్లు మళ్ళీ ముందుకు సాగేయి.

లెవెల్ క్రాసింగ్ దగ్గర రెక్కబల్ల దించే ఉంది. విజయనగరంవైపు వెళ్లే పాసెంజరు ఇంకా రాలేదన్నమాట. గేటుదగ్గరి రైల్వే లాంతరు మిణుకుమిణుకుమంటూ శంకరాన్ని పలకరించింది. "ఎక్కడికోయ్ మిత్రమా ఈ చీకటి రాత్రి?"

"అబ్బే! అలా కాస్త గాలి తిందామని" అన్నాడు శంకరం కొంచెం జంకుతూ.

"జాగ్రత్తగా నడువ్. ఎదురుగా *Fencing* ఉంది. అయినా ఏమిటో ఒక్కడివీ గాలితినడానికి ఇంతదూరం రావడం నాకేం బాగులేదుసుమీ" అని గొణుక్కుంది బిక్కుబిక్కుమని. లెవెల్ క్రాసింగ్ గేటుపోర్టరు ఇంట్లో ఎవరో అమ్మాయి జోరుగా ఏడుస్తోంది. ఒక మొగగొంతుక - బహుశః పోర్టరుదై ఉంటుంది - బిగ్గరగా తిడుతోంది.

"ఆయింట్లో ఏదో గోల అవుతున్నట్టుందే?" అన్నాడు శంకరం.

"అలాగే ఉంది. నాలో చమురుకూడా ఇవాళ సరిగ్గా పోసేడుకాడు నా మొగమేనా తుడవలేదు. అగ్గిపెట్టె ఉందా?" అంది లాంతరు ఒక వేడినిట్టూర్పు విడిచి.

"ఊ. ఎందుకూ?"

"ఆరిపోతానేమోనని భయం వేస్తోంది."



# మనుషులా... మనసులా!



శంకరం కళ్లు జల్లుమంది. మరొక సిగరెట్టుతీసి ముట్టించబోయేడు. వెలిగించిన అగ్గిపుల్ల సిగరెట్టుకి తగిలిస్తుంటే చేతులు వణకడం శంకరం కళ్లు కళ్లారాచూసేయి.

దభీమని పోర్షనుఇంటి వీధితలుపు తెరుచుకుంది. ఆ గుడ్డివెలుతురులో ఒక స్త్రీ వెక్కి వెక్కి ఏడుస్తూ వాకిలిలోఉన్న రాతిదిమ్మ మీద కూర్చుంది.

“నీ పాడుముఖం నాకు మరీ చూపించకు. ఏ గంగలోనన్నా దూకి చావు. దరిద్రగొట్టా ......” వీధి తలుపు మళ్ళీ మూసుకుంది. మరోసందర్భంలో అయితే శంకరం

అసలువిషయం ఏమిటో కనుక్కొని ఆ అమ్మాయిని కాస్త ఓదార్చేవాడే! కాని ఈరాత్రి శంకరం ఇతరులజీవితాల్లో జోక్యం జేసుకునేస్థితిలో లేడు. అక్కడి నిశ్శబ్దమైన పరిసరాల్ని ఆమె ఏడుపు చీలుస్తోంది జాలిగా అక్కడినుంచి కదిలి రైలు పట్టాలకి వాలుగా కాస్తదూరం నడిచి రావిచెట్టు నీడలోఉన్న సిమెంటుబల్లమీద కూర్చున్నాడు. ఎదురుగా పెద్ద జైలుగోడలు నిటారుగా రాకాసుల్లాగు ఆకాశంలోకి ఆవలిస్తున్నాయి. జైలుగేటుదగ్గిర *Mercury Vapour Lamp* నీలివెలుతురులో ఏవో నీడలు నలువైపులా నల్లనిసాలుకలుచాచేయి. చుట్టూ కీచురాళ్ళకచేరీ – సన్నగా చెవుల్లో ఆ అమ్మాయిరోదన. శంకరం చుట్టుపక్కల ఉన్న *Background* తను చెయ్యబోయే కార్యానికి అన్నివిధాలా అనుకూలంగా ఉంది. శంకరం మనస్సు, పాతికసంవత్సరాలకే సర్వసుఖాల్నీ పోగొట్టుకొని, తను చేయనినేరానికి శిక్ష అనుభవించడానికి వచ్చిన ఈ బొంది తాలూకు జీవితాన్ని, ఒక్కసారిగా సింహావలోకనం చేసుకుంది.

"ఒరే శంకరం! ఒక్కసారి మనసారా ఏడ్చెయ్యరా. నేను తేలికపడతాను" అంది బరువుగా మనస్సు.

"ఛస్. నేనేం ఆడదాన్ని కాను బయటకి ఏడవడానికి. అయినా కొన్నిక్షణాల్లో నువ్వూ నేనూ వేరవుతాం. నా ఊసు నీకెందుకు?" అన్నాడు అతను. దూరంగా రైలు కూసింది. ఉలిక్కిపడ్డాడు. పోర్టరు ఇంటితలుపు తీసుకొని జండాలు పట్టుకొని బయటికొచ్చేడు.

"పాసెంజరు ఒస్తుండాది. రైల్లో మనుసులు సూసివారంటే బాగోదు. సాటుగా పో! దిక్కుమాలిన......" అని కొట్టడానికి జండాకర్ర ఎత్తి మళ్లీ దింపి ఏదోగొణుక్కుంటూ గేటుదగ్గరకి నడిచేడు. రాత్రి దిమ్మమీది స్త్రీ చలనం లేదు. దూరాన రైలుపట్టాల మలుపులో ఆ చిక్కటి చీకటిలో బ్రహ్మరాక్షసి మూడో నేత్రంలాగు చొచ్చుకువస్తోంది హెడ్ లైటు. రావిచెట్టు నీడలోని శంకరం మెల్లగా లేచేడు. చుట్టూ ఒకసారి చూసేడు. అక్కడికి బాగా దూరంలోఉన్న దుకాణందగ్గరతప్ప మరెక్కడా జనసంచారం లేదు. అమ్మాయి కూడా రోదించడం ఆపేసింది. కీచురాళ్లు శంకరాన్ని గమనించినట్టే లేదు.

రైలు మలుపు తిరిగింది. హెడ్ లైటు కాంతి ఒక్కసారిగా ఆ ప్రదేశాన్నంతటినీ వెలుగులోకి తెచ్చింది. శంకరం పాదాల కింది నేలంతా రైలు బరువుకి గజగజలాడుతోంది. ఆఖరిదమ్ము లాగి, సిగరెట్టు పారేసి, దృఢంగా, నిశ్చలంగా శంకరం అడుగులు ముందుకు వేసేడు.

"ఓసి నీ! ఎక్కడికే—ఎక్కడికే? ఆగవే అమ్మా! నా కొంప తీయకే!" భయంకరంగా అరుస్తున్నాడు పోర్టరు. ఇంజను ఊరికే కూత కూస్తోంది. తటాలున శంకరం పోర్టరుఇంటివైపు చూసేడు. వస్తాన్న రైలుబండీవైపు, పట్టాలకి మధ్యగా పరుగిడుతోంది ఆ అమ్మాయి. గేటుదగ్గరనుంచీ అరుచుకుంటూ వస్తున్నాడు పోర్టరు.

"ఆగు......ఆగు."

అది శంకరం గొంతుకే! శంకరం ఒక్కసారిగా ఇటునుంచి అమ్మాయివైపు పరుగుపుచ్చుకున్నాడు. అమ్మాయి దగ్గరికి రాగానే ఆమెని గట్టిగా పట్టుకుని ఒక్కతోపు తోసేడు. ఆ ఊపుతో ఇద్దరూ కలిసి దొర్లుకుంటూ పక్కనున్న ముళ్లతుప్పల్లో పడ్డారు. అంతే! మరుక్షణంలో శంకరం ముఖానికి ఇంజను వేడి గుప్పుమని తగిలింది. డ్రైవరు ఏవో తిడుతున్నాడు. రైలు పెట్టెలు ఒకొక్కటే దాటుతున్నాయి. పెట్టెలలోని మనుష్యులు అనేక రకాలైన చూపులతో వీళ్ళద్దర్నీ చూస్తున్నారు. శంకరం ఒక్కసారి కళ్లు మూసుకొని కొంతసేపటికి తెరిచేడు. అప్పుడే దాటిన గార్డుపెట్టె వెనక ఎర్రటి దీపం దూరదూరంగా పోతోంది.

"నన్ను వదిలెయ్. నన్ను వదిలెయ్" అని అమ్మాయి అరుస్తూనేఉంది. ఇప్పుడా అరుపులు మొదటిసారిగా శంకరం చెవుల్లో పడ్డాయి. ఆమెను ఒక్కగుంజుతో నిలబెట్టి లాగి లెంపకాయ కొట్టేడు. ఆమె అరవడం మానేసింది. చాలాసేపయి ఏడుస్తూవుండడం మూలాన్ని వెక్కుతోంది. ఆమె రెక్కపట్టుకొని పోర్టరు ఇంటివైపు నడిపించుకొవచ్చేడు.

"నా కొంపతీద్దువే! నువ్వు నాకెక్కడ దాపురించేవే!" అని దీర్ఘాలు తీస్తున్నాడు పోర్టరు.

"నోర్మూయ్!" అన్నాడు శంకరం. తెరచిన నోరుతో అలాగే ఉండిపోయేడు వాడు.

"కాసిని మంచినీళ్లు తీసుకురా."

ఆ నీళ్లతో ఆమె ముఖం కడిగి తన పంచెతో తుడిచేడు.

"చూడమ్మాయ్! ప్రాణం చాలా విలువైంది. మీ నాన్న నీ మీద ఏదో కోపం చేసుకున్నాడని ఇంత అఘాయిత్యం తలపెట్టడం తప్పుకాదూ?"

"ఏదో కోపంకాదు. ఇది నా గుండెలోనే నిప్పెట్టింది బాబూ!" అన్నాడు గుండెలు బాదుకొని పోర్టరు. శంకరం ప్రశ్నార్థకంగా వాడి వైపు తిరిగేడు.

"మీరు మా రాజులు. మా బీదోళ్ల పాట్లు మీకేటి తెలుస్తయ్? ఇది మనువు కెళ్లకుండానే కడుపుతో ఉంది సామీ! నా కేది దారి?"

ఈ మాటు పోర్టరు నెత్తిమీద రెండు చేతులూ వేసుకొని ఏడుస్తున్నాడు.

"దీని తల్లిపోయినకాడనుంచి దీన్ని గుండెలమీద పెంచేను. బతికి చెడినవోణ్ణయినా దీని కేలోటూ రానీయలేదు. కంటికి రెప్పలా కాపాడుకుంటూ వొచ్చినానే! ఓరి బగవంతుడా! ఇప్పుడేది దారి?"

"అబ్బబ్బ. ఊరుకోవోయ్? ఊరుకో. మొగవాడివై ఉండి నువ్వే అలా ఊరికే బెంబేలుపడిపోతే ఎలా? ఇదిగో. చూడు! వాడెవడో కనుక్కొని......మెల్లిగా.... ఏమిటి?"

"నాబం నేరు సామీ. అదికూడా అడిగి సూసినాను. రోజూ నా దగ్గరకి కోడిగుడ్లు కొనడాని కొస్తున్న పంతులూ..."

అమ్మాయి ఒక్కసారిగా భోరుమంది.

"ఊరుకో అమ్మాయి. ఊరుకో. దీనికేదో ఉపాయం నేను చూస్తాగా. ఊరుకో! ఆ...అయితే ఆపంతులు పేరేమిటన్నావ్?"

"పేగెవడికి తెలుస్తాయి సామీ. ఇదాణ్ణి 'ఇప్పుడు నా గతేటని' అడిగితే అయిదురూపాయల నోటు సేతిలో పెట్టినాడంట! దొంగనా...! రేపు సీకటి పడేలోపల ఆడి నెత్తురు సూడకపోతే నేను గంగులుకి పుట్టినోణ్ణి కాను"

తండ్రీ కూతుళ్లకి రాజీ కుదిర్చేసరికి చాలాపొద్దుపోయింది. ఆఖరుసారిగా అమ్మాయితో శంకరం అన్నాడు.

"చూడమ్మాయ్! నీ జీవితంలో ఇలాటి ఒడిదుడుకు లనేకం వస్తాయి. వాటికి తట్టుకొని ధైర్యంగా నిల్చోవాలిగాని పిరికివాళ్లలాగు ఆత్మహత్య చేసుకుంటే నీకేం లాభం? మీ నాన్న చూడు. నీ కోసం ఎలా బెంగపెట్టుకుంటున్నాడో!" అని.

తన కూతురుకి ప్రాణదానం చేసిన మహానుభావుడు శంకరానికి దండాలర్పించుకుంటూ పోర్టరు ఇంట్లోకి పోయేడు. గేటు దాటి కోర్టు పేటరోడ్డు పట్టేడు శంకరం. తను వెళ్లిన పనేమిటి? చేసుకొచ్చిం దేమిటి?

"ఒరే గుమస్తా శంకరం! నీకు చావడానికేనా అధికారం లేదురా!" అనుకున్నాడు శంకరం.

"చావడం కూడా చాతకానివాడివి బ్రతికుండి మాత్రం ఏం లాభం?" అంది శంకరం నీడ. దానివైపు కోపంగా చూస్తూ ఎలక్ట్రిక్ స్తంభం దగ్గరికి గబగబా నడిచేడు. నీడ ఆ చూపుకి తట్టుకోలేక చిన్నచిన్నదై మాయమైపోయింది.

"బాబూ! రిక్షా."

"అక్కరలేదు."

"బారకాసుకి పావలా ఇస్తే చాలు. తీసుకుపోతాను బాబూ."

"అక్కరలేదంటూంటే!"

"రాండి బాబూ! ఇయాళ బొత్తిగా బేరం నేదూ!"

శంకరం రిక్షాలో కూర్చున్నాడు. బారకాసు దగ్గర జ్యోతీ సినిమాహాలులో అప్పుడే

మొదటాట వదిలిపెట్టేరు. దొమ్మ జోరుగా ఉంది. రోడ్డుపక్క షాపులో అరకప్పు టీ తాగి మైదానంవైపు నడిచేడు. మైదానం మారుమూల ఎక్కడో ఒక పాడుపడ్డ దిగుడు బావి ఉంది. అందులో పడ్డవాళ్ళు అచోకీ చచ్చిన మర్నాడుకూడా తెలియడం కష్టం. ఒకవేళ అదృష్టం బాగుంటే...!

శంకరం అటువైపు మెల్లిగా అడుగులు వేసుకుంటూ నడిచేడు. మైదానం అంతా నిశ్శబ్దంగానే ఉన్నట్టుంది. చుట్టూ చీకటి!

దూరంగా పొలాల్లో నక్కలు అరుస్తున్నాయి. సమీపంలోని పంటకాలువ దగ్గర నుంచి కప్పలు బకబక మంటున్నాయి. చల్లటిగాలి కెరటాల్లా వచ్చి శంకరాన్ని తాకుతోంది. కొద్ది దూరంలో ఏదో ఎర్రగా కాలుతోంది.

"కొరవిదెయ్యం అయిఉంటుంది. ఈ నూతిలో ఎంతమంది చచ్చేరో!" అనుకుని శంకరం ముందుకు అడుగువేసేడు. కొరవి దెయ్యం తెల్లటి చీర కట్టినట్టుంది.

"ఏం బావా! యాడకి పోతుండావ్?" అంది దెయ్యం.

"హతోస్మి" అనుకున్నాడతడు.

"నేనెక్కడికి పోతే నీకెందుకు?"

"పలకరిస్తేనే అంత కోపమెందుకు బావా! జాగ్రత్త! ముందు కెళ్ళేవ్! దిగుడుబావొకటుంది." అంటూనే ఆమె దగ్గరకొచ్చింది. బీడీ ఒకటి కాలుస్తోంది. శంకరం రెక్కపట్టుకొని "వస్తావా?" అంది.

"ఎక్కడికి?" అన్నాడు.

"చెబుతాగా. రా." కాలువ గట్టుమీదుగా ఆమె ముందు, తాను వెనక నడుస్తున్నారు. అక్కడక్కడ గడ్డికొంపలు—చుట్టూ దుర్గంధం. చీకటిలో ఎక్కడో ఊరకుక్కొకటి అరుస్తోంది. కుడివైపు తిరిగి ఒక చిన్న సందులోకి ప్రవేశించేరిద్దరూ. చేతిరుమాలు ముక్కుకి అడ్డంగా పెట్టుకున్నాడు. ఒక చిన్న పాకకి గొళ్ళెం వేసిఉంది. గొళ్ళెంతీసి లోపలికి




ప్రవేశించిందామె. శంకరం అనుసరించేడు. ఆమె తలుపువేసి గడియ పెట్టింది. చీకట్లో తడిమి అగ్గిపెట్టితో చిన్న బుడ్డీదీపం ఒకటి వెలిగించి శంకరంవైపు తిరిగింది. పొగచూరుతున్న ఆముదం దీపం ఎర్రని వెలుగులో గదిలోని వస్తువుల నీడలు మట్టిగోడమీద కొట్టుకుంటున్నాయి.

మొదటిసారిగా ఆమెను చూసేడు. వయస్సు ఇరవైలోపునే ఉంటుంది. నలభై సంవత్సరాల నరకం ఆ శరీరంలో ప్రతిబింబిస్తోంది. బీడీలు తాగి తాగి పెదిమలు నల్లగా అయిపోయేయి. కళ్ళు కల్లుతాగినట్టు ఎర్రగా ఉన్నాయి. చేతులకి చవకబారు రబ్బరుగాజులు. సవరం వేసి కట్టిన జడలో బంతిపువ్వుల చెండొకటి ఉంది.

"ఎంత తీసుకుంటావ్?" అన్నాడతడు.

"నీలాటోడిదగ్గర ఎంత పుచ్చుకోనూ? ఒక రూపాయియ్యి!" అంది.

"సరే ఇస్తాను. అలా మంచంమీద కూర్చో." ఆమె కూర్చుంది.

"ఇదిగో చూడు! నేనో ప్రశ్న అడుగుతాను. జవాబు చెబుతావా?"

"నువ్వు పిచ్చోడివి కావుగద!" అంది.

"కాను"

"అయితే అడుగు."

"నువ్విలా ఈ ఛండాలపు బ్రతుకు బతికేకంటే చావవెందుకు?"

"ఏటన్నావ్?" అంది ఒక్కసారిగా.

"ఏమిటన్నానో విన్నావుగా!"

"ఇదేట్లో నాకేమీ బోధపడ్డంలేదు. పోనిద్దూ!"

"నీకు పూర్తిగా బోధయింది. నీ శరీరం నాకక్కరలేదు. నీ రూపాయి ఇచ్చేస్తాను. చెప్పవూ?" బతిమాలుకున్నాడు. "నువ్వెందుకు బ్రతుకుతున్నావ్?"

"ఎందుకు బతుకుతున్నానా? చావలేక బతుకుతున్నాను. ఎలా బతుకుతున్నానంటావా? నీలాటి రకం ఈ ఊళ్ళో ఉండబట్టే బతుకుతున్నాను సరా?" అంది కసిగా. ఆమె ముఖం కోపంతో ఎరుపెక్కింది.

"సరే. పోతున్నా" అని నిరాశతో ద్వారంవైపు కదిలేడు.

"ఆగు. ఇలా ఒచ్చి కూకో! సూడూ! ఒక రూపాయి డబ్బులిచ్చి నా బతుకంతా కొనేద్దామనుకుంటున్నావా? ఇదిగో! నువ్వు గుమాస్తావేనా?"

"ఆ!" అన్నాడు.

"అందుకనే ఇలా అడుగుతున్నావు. అప్పుడే అనుకున్నాలే! మీ దే కులం?"

"నీ దే కులం?"

చెప్పింది. "ఆశ్చర్యంగా ఉందా? నాకూ ఆశ్చర్యంగానే ఉంటుంది అప్పుడప్పుడు." ఒక్కసారిగా ఆమె యాసతో మాట్లాడడం మానేసింది.

"మా నాన్న అంటుండేవాడు నా చిన్నతనంలో—మన కులంలో చాలా ఘోషా అమ్మా! అలా ఎప్పుడు పడితే అప్పుడు వీధిలోకి రాకు—అని. ఆ మాటలు తలచుకొంటూంటే నా కిప్పుడు నవ్వొస్తూంటుంది." ఆమె కళ్ళలో నీళ్ళు నిండేయి.

"నీలాగే కొన్నాళ్ళకిందట ఎవడో కథలు రాసేవాడట......అడిగేడు......అయినా వాడి గొడవ ఇప్పుడెందుకులే... మానాన్న చచ్చిపోయిననాడే నేనూ చద్దామనుకున్నాను. తర్వాత ఓ తురకోడు నన్నీ ఊరు లేవదీసుకువచ్చేడు. అప్పుడు పదంతా ప్రేమ అనుకున్నాలే! ఇక్కడికొచ్చిన తర్వాత నన్ను రోజూ తన్నేవాడు. అప్పుడూ చావలేకపోయేను. ఈరోజుకీ వాడు నాకు డాఫరుగా పనిచేస్తున్నాడు. ఇప్పుడు వాణ్ణి నేను తంతున్నాను. వాడూ చావలేడు."

కాళ్ళు మంచంమీదికి ముడిచి, మోకాళ్ళ మీద గడ్డం ఆనించి శంకరంవైపు ముఖం తిప్పింది. "నన్ను నువ్వడిగినట్టే అప్పుడప్పుడు నేనూ అనుకుంటుంటాను. నాలాటిది ఎందుకు చావకూడదు అని! కాని నేను చావలేను. మా పేటలోనే ఓకుర్రాడు పరీక్ష పోయిందని ఉరిపోసుకొని చచ్చేడు. మావీధిలోని దొరకత్తె మొగుడు సినిమాకి తీసుకెళ్ళలేదని నల్లమందు, నూనె తిని చచ్చింది. కాని నేనుమాత్రం చావలేను. అలా బతికేఉన్నాను. అరి భగవంతుడా! నాకు చావడానికి ధైర్యం ఎందుకు లేదు?"

ఆమె మంచంమీద బోర్లాపడి బిగ్గరగా ఏడుస్తోంది.

"ఈ గొడవంతా ఎత్తి నన్నిలా బాధపెట్టడానికి ఒచ్చేవు? పో ఛండాలుడా! పోవేంరా?"

శంకరం నేలమీద కూర్చున్నవాడల్లా తాపీగా లేచేడు. బుడ్డీదీపం ఎత్తి దానికింద రూపాయినోటు పెట్టి, మెల్లిగా ద్వారం దగ్గరకి వెళ్ళి తలుపు తెరచేడు.

"ఏయ్!" అంది మంచంమీదనుంచే.

"ఊఁ!" అని మూలిగేడు శంకరం.

"మరో రూపాయి ఉంటే ఇచ్చిపో."

"లేదు" అన్నాడు. పక్క జేబులు తడుముతే ఓ పావలాకాసు చేతికి తగిలింది.

"ఒక పావలా ఉంది" అన్నాడు.

ఆమె ఏదో గొణుక్కుంది.

"పోనీలే. అదే అలా విసిరేసిపో."

శంకరం రోడ్డుమీదికొచ్చి పొంగివస్తున్న కన్నీళ్ళని రుమాలుతో తుడుచుకున్నాడు. మబ్బు విడిపోయింది. తను ఇన్నాళ్ళయి ఛేదించలేకపోతున్న ఒక తీవ్రమైన సమస్యని ఈ చీకటిరాత్రి ఒక బక్కచిక్కి

(49-వ పేజీ చూడండి)



# ఇద్దరమ్మాయిలూ-ముగ్గురబ్బాయిలూ

(గత సంచిక తరువాయి)

రామారావూ వీర్రాజూ మాట్లాడలేదు. లేచినించున్నారు. ఇంటికెళ్ళిపోతూన్నట్టు.

"ఆగండి"

ఆగారు. సుందరం వీర్రాజు దగ్గర కొచ్చాడు. స్కూల్లో దువ్వెన తీసుకున్న పద్ధతిగా వీర్రాజు జేబులోవున్న ప్రేమలేఖ తీసుకున్నాడు హుందాగా.

"ఏయ్!" అన్నాడు వీర్రాజు.

రామారావు కొంచెం ధైర్యం తెచ్చుకుని "ఇదేం సినిమాలో వేషం వేసినట్టుకాదు. ఆఉత్తరం ఇచ్చెయ్యి. లేపోతే మావీధికిరా తన్నిస్తా." అన్నాడు.

సుందరం గంభీరంగా నవ్వాడు. సినిమా వేషంలాగ కనుబొమ్మలు పైకెత్తాడు. పెదిమలు వంకరతిప్పాడు. "ఏడిశారు. మీ సంగతంతా వినేశా. దొంగరాముడిచేత సుబ్బిశెట్టి వాళ్ళని తన్నించింది మీరేనని అందరికీ చెప్పేసి - శెట్టి వాళ్ళకి చెప్తా. సెట్టి ఇక్కడ ధాన్యం కొనడు. రైతులంతా మిమ్మల్ని చితక్కొట్టేస్తారు" అన్నాడు పావకోళంగా.

వీర్రాజు తలగోక్కొని తిప్పలు పడుతున్నాడు ఏదో జ్ఞాపకం చేసుకోడానికి.

రామారావు తల వంచుకున్నాడు.

సుందర్రావు ధైర్యం ద్విగుణీకృతమైంది. "పైగా సీత రాసిన ఉత్తరం నలుగురికీ చూపిస్తా. కరణంగారూ, ఆయన మనుషులూ నిన్ను తంతారు వేరే - రైతులు కాకుండా"

రామారావు కొంచెం ఆలోచించాడు. "సుందరంగారూ. మీరు విధవ్వేషాలేస్తే, మీ ఫ్రెండు సినీభాయ్‌గారు చెప్పిందంతా అందరికీ చెప్పేస్తా. మీకు కుదిరినసంబంధం చెడకొడతా" అన్నాడు మర్యాదగా.

"ఏడిశారులెండి రామారావుగారూ. మీ ఆశ అదే అని నాకు తెలుసుగాని. తాంబూలాలు ఇచ్చుకున్నాం. ఇక మీరు చేసేది ఏంలేదు. సినీభాయ్‌ని నేను ఊరిచివరే కలుసుకుని పంపేశా. మీ మాటలు ఎవరూ నమ్మరు" అన్నాడు సుందరం సాదాగా.

రామారావుకి బిక్కమొహం పడింది.

"రైలుఛార్జీ లెక్కడివి?" అన్నాడు వీర్రాజు కుతూహలంకొద్దీ.

"వీర్రాజుగారూ. మీరు పరమరాడీలు. ఊళ్లోకి పెద్దమనిషి వస్తే వాడిని జెల్లించి రహస్యాలు చెప్పించడం పెద్దమనుషుల పని కాదు. నాకుకల్చర్ ఉంది కాబట్టి ఊరుకున్నాగానీ - ఈపాటికి మిమ్మల్ని చావకొట్టేవాణ్ణి."

రామారావుకి ఒళ్లు మండిపోయింది. "అండీ ఎందుకండీ అండీ. బండీసి. ఓపక్క తిట్టిపోస్తూ మళ్ళీ అండీ ఎందుకూ. కొట్టండి. ఏమాత్రం కొడతారో - ఊ బెదిరిస్తున్నారు" అన్నాడు ఉరుముతూ.

"రామారావుగారూ - మీరు నాతో ఓడిపోయారు. మీమీద కోపంలేదు నాకు. మీరేమన్నా ఊరుకుంటా. ఆట్టే ఎక్కువ మాటాడితే నిజంగా తంతా. నాకు చాలా బలం ఉంది. చెన్నపట్టణంలో పలుకుబడి వుంది. అందుకని పూర్తిగా తగ్గిపోండి. నేను మాట్లాడేది వీర్రాజుగారితోనే. ఆయన నాకథ దండోరా వేస్తానంటున్నాడు. ఏమయ్యా. వేస్తావా - నీఉత్తరం బయట పెట్టేస్తా. జాగ్రత్త. నోరు మెదిపావంటే జాగ్రత్త. అవతలనించీ మీరు మాట్లాడిందంతా విన్నా. జాగర్త."

"ఏవయ్యోయ్ సుందర్రావ్. మిడిసిపడి పోతున్నావ్. తెల్లారేసరికి నిన్నేంచేయి

 ముళ్ళపూడి వెంకటరమణ 

# ఇద్దరమ్మాయిలూ - ముగ్గురబ్బాయిలూ

...స్తానో చూడు" అన్నాడు రామారావు కర్కశంగా.

వీర్రాజు ఇంకా బిర్రగొట్టుకుంటున్నాడు సుందరంవంక చూస్తూ.

సుందరం గసిరాడు "ఎందుకోయ్. నావంక అలా మిటకరించి చూస్తావ్. తెగులు తగిలిన కోడిలా?" అన్నాడు.

"ఆఁ! యురేకా! కోడి! కోడి!" అని ఒక్క గెంతువేశాడు వీర్రాజు. దీపం వెలిగించిన గదిలాగా ధైర్యసాహసాలతో, ఉత్సాహంతో వీర్రాజు భౌతికశరీరం ఆపాదమస్తకం నిండిపోయింది. దాంతో రక్తానికి చోటులేక తన్నుకుంది. అందుకని వీర్రాజు తాగిన కోతిలా ఆడిపోయాడు. సుందరం నివ్వెరపోయి నోరు తెరిచాడు—వీర్రాజు అమాంతం ఆంజనేయుడవడంచూసి. అయినా ధైర్యం చిక్కబట్టుకుని కొంచెం డబాయించాడు.

"ఈ వెధవ్వేషాలు నాదగ్గర కుదరవు నేను పీపీభాయ్‌లాగ మోసపోయేవాడిని గాను. ఈ ఉత్తరం అందరికీ చూపించేసి, దొంగరాముడిచేత పెద్దమనుషుల్ని తన్నించారని దండోరావేసి కనిష్టీబుని తీసుకు రావడం చేసితీరతా తప్పదు" అంటూ.

వీర్రాజు కొంచెం కుదుటపడి శత్రుసంహారాని కుపక్రమించాడు. "రాముడూ! వీడెంత ఖలుడురా! పల్లెటూరి వారిని మోసంచేసి సినిమావెలిగిస్తాట్ట పట్నంలో... హుఁ!" అన్నాడు.

"సినిమాకాదు. టెలివిజన్ తీయమనుమన కెందుగ్గానీ సుబ్బలక్ష్మి నాన్నకి టోకరా ఇచ్చాడురా! తప్పుకాదూ" అని కూడా అన్నాడు. ఇంకా ఇలా అన్నాడు "ఆఁ! తప్పుకాదూ పైగా ఇటు సీతకి ఉత్తరాలు రాస్తాడూ! అన్నా! గోపాలకృష్ణుడనుకొన్నాడు కాబోసు"

రామారావుకి వీర్రాజు ధోరణిచూస్తే కొంచెం ధైర్యంచిక్కింది "మరే! వీళ్లంతా గోపికలనుకొన్నాడు కావును" అన్నాడు.

"మరే! మనమంతా లేమనుకున్నాడు కాబోలు!"

"ఔనౌను. ఉన్నా చవటలం అనుకున్నాడు కాబోసు!"

సుందర్రావు కిదేమీ అంతుబట్టలేదు. అనుమానంతో మెడ టకాటకా ఎడాపెడా తిప్పేసి ఇద్దర్నీ చూస్తూ ఇద్దరి మాటలూ వింటున్నాడు.

"వెధవ" అన్నాడు వీర్రాజు.

"చవట"అన్నాడు రామారావు పుంజుకుని—సుందరంవంక చూస్తూ.

"రౌడీ"

"రాస్కెల్"

"గూస్"

"గాండర్"

"హార్స్"

"మేర్"

"మాన్"

"ఉమన్"

"బోయ్"

"గరల్"

"ఒరేయ్! రాజా. అరు. మనం గ్రామర్ చదివేస్తున్నాం"

"ఏమిటిదంతా. మిమ్మల్ని గుడిగోపురం మీదకి విసిరేస్తా" అన్నాడు సుందరం.

"దురాత్ముడు" అన్నాడు వీర్రాజు.

"దుర్జనుడు" అన్నాడు రామారావు.

"దుష్టుడు"

"దుర్మతి"

తరవాత ఇద్దరికీ తెలుగు మాటలు జ్ఞాపకం రాలేదు.

"ఆఁ!...ఖలుడు" అన్నాడు వీర్రాజు.

"మరే—ఖలుడు" అన్నాడు రామారావు.

"ఒరేయ్ రాముడూ—నీకు ఖలుడు పద్యం వచ్చురా"

"ఏ ఖలుడురా?"

"అదే—ఖలునకు నిలువెల్ల విషము..."

"అదా—మొదలు జ్ఞాపకం లేదు. 'సుమతీ' అని చివర్నొస్తుంది."

సుందరానికి జ్ఞాపకం ఉంది. కానీ చెప్పలేదు.

వీర్రాజుకి కొంచెం జ్ఞాపకం వచ్చింది. "తలనుండు విషము ఫణికిని వెలయంగా తద్దడ నవన డడడా నానా చివరని ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ—గదరా రావుడూ?" అన్నాడు.

"మరే! నిలువెల్ల విషము"

"ఖలుడెంత పవర్‌ఫుల్ తెలుసా. అమధ్య ఓ ఖలుడ్ని ఓ తేలు, ఖలుడన్న సంగతి తెలీక కుట్టిందట—అంతే—ఖలునకు నిలువెల్ల విషముగదూ తారువచ్చింది. అలాగే ఓ పాము. ఇంకా అలాగే నల్లులు, దోమలు..."

"వీర్రాజూ! జ్ఞాపకం ఉంచుకోరోయ్! సినిమాహాలులో నల్లులు సమృద్ధిగా ఉండడం లేదు ఈమధ్య. మ్యాటనీకి వదలిన నల్లులు ఆరుగంట్లాటకల్లా ఛస్తున్నాయట. ఎందుకో తెలీక ఇన్నాళ్ళూ గిలగిల్లాడా. ఈ పన్ను చేసేవాళ్ళూ కొంపలు తీసేవాళ్ళూ బ్లాక్‌మార్కెట్ చేసేవాళ్లూ, మతిస్థిమితం కోసం అని అస్తమానూ సినిమాల కెడుతున్నారు. ఆ నల్లులు తెలీక వాళ్ళని కుట్టి అమాంతం ఛస్తున్నాయి - విల్లేవా రాయకుండా"

"అలాగే - రిసెర్చి బుక్కులో రాసుకుందు గానిలే. ఒరేయ్ రాముడూ దోమల గురించికూడా ఓ పుస్తకం రాయరా. బంగారయ్యగారింటిదగ్గర ఇపుడు కొంగడా వేసి వెతికినా దోమల్లేవుట. నీలాటి రేవులోనూ రచ్చబండదగ్గరా ఇదే చెప్పుకు విస్తు

పోతున్నారు ఆబాలగోపాలం. దోమలు ఎందుకు లేవు తెలుసా? వీడు—ఈ ఖలుడు అయిన సుందరంగాడు అక్కడ పడుకుంటున్నాడుగా. అమాయకపు దోమలు ముందూ వెనకా చూసుకోకండా గొర్రెల మంద గోతిలో దూకినట్లు, వీడిమీదపడి కుట్టేశాయి. తారున మరణించాయి"—

"హాయ్యబాబోయ్!" అన్నాడు రామారావు.

తరవాత ఇద్దరికీ ఏం మాట్లాడాలో— తోచలేదు. సుందరం ఉగ్రనరసింహంలా వున్నాడు. మాటలన్నీ పూర్తవగానే తిన్నేవాడిలా కనబడ్డాడు. పళ్లు పటపట కొరుకుతున్నాడు.

మాటలవగానే అమాంతం వీర్రాజు కాలరు పట్టుకున్నాడు. "ఎందుకు నన్నిలా అన్నావ్? నిన్నిపుడు—చావ బాది డొక్క చీల్చి డోలు కట్టేసినా పాపం వుందా?"

రామారావుకి జ్ఞానోదయం అయింది. నిజమే! ఎందుకు వీణ్ణిలా చెడతిట్టినట్టు. ఏ ఆసరా చూసుకుని? వీర్రాజు పిలుస్తుంటే తనూ వుంజుకున్నాడు. ఇపుడు గ్రంథం ముదిరింది.

వీర్రాజుకి మాత్రం ఒక ఆసరా వుంది. అది చూసుకునే ఇంత స్వేచ్ఛగా తిట్టాడు. తీరా సుందరం కాలరట్టుకునేటప్పటికి అది కాస్తా మర్చిపోయాడు.

వీర్రాజు దిక్కు మొహం పెట్టి బాధగా చూశాడు సుందరంవంక.

రామారావు కొంచెం ఆలోచించాడు.

"ఏవండోయ్ సుందర్రావుగారూ. మనం గుడి వెనక్కెళ్ళి పోట్లాడుకుందాం రండి. జనం వచ్చే వేళయింది" అన్నాడు అణుకువగా.

సుందరం వినిపించుకోలేదు. వీర్రాజు కాలరు పట్టు బిగించాడు.

"చెప్పు! ఎందుకలా చూస్తావు తెగులు తగిలిన కోడిలాగు?" అన్నాడు.

వీర్రాజుకి మళ్ళీ ఆంజనేయుడంత బలం వచ్చింది. "కోడీ! పకోడీ!" అన్నాడు. ఒక్కసారి గింజుకుని సుందరం పట్టు వదిలించుకున్నాడు. రెండడుగులు వెనక్కి వేశాడు కాలరుమడత సర్దుకున్నాడు. ఆతరువాత చేతులు కట్టుకుని గంభీరంగా నోటి చివర నించీ చిన్న నవ్వు నవ్వుతూ నించున్నాడు.

సుందరం ఓ అడుగు ముందర కేశాడు.

వీర్రాజు చలించలేదు. "ఆగరా! పకోడీ! ఆగాగు!" అన్నాడు.

అంతే - సుందరం బాలనాగమ్మకథలో బాలవర్ధిరాజు తండ్రిలా రాతిబొమ్మ అయిపోయాడు.

వీర్రాజు సగర్వంగా నవ్వాడు.

రామారావు విస్తుపోయాడు ముక్కుమీద వేలు వేసుకుని.

"హుఁ!" అన్నాడు వీర్రాజు తన కాలరుని బొటనవేలూ చూపుడువేలు మధ్య ఇస్త్రీ చేస్తూ—జాలు సవరించుకుంటూ. "పకోడీ కథంతా నాకు తెలుసులేవోయ్! పకోడీల ముసిలీ దాని తమ్ముడూ మాయింటి కొచ్చారు—హుఁ" అన్నాడు.

"పకోడీ ఏమిటి? పకోడీ గికోడీనీ?" అన్నాడు సుందరం. అప్పటికే అతను గాలి తీసిన బుడగలా, పాడుపడిన కొంపలాగా, పిల్లలు లేని ఇల్లులా, గుడిలేని ఊరులా కళావిహీనవదనుడయి పోయాడు. జబ్బుపడి పథ్యం పుచ్చుకో బోతున్నవాడిలా మొహం పెట్టాడు.

వీర్రాజు గాంభీర్యం వహించాడు. "నాకు నీ పకోడీవ్యవహారమంతా తెలుసు. కంఠతా వచ్చు. ముసలమ్మని తెచ్చా. వెధవ్వేషాలేస్తావో - మానావో చెప్పు."

పశ్చాత్తప్తుడయిన ఖూనీకోరులా తలవంచుకొని "వెయ్యను"అన్నాడు సుందరం.

"ఏవిటి వెయ్యవు?"

"వెధవ్వేషాలు"

"వెధవ్వేషాలు ఏంచెయ్యవ్?"

"వెధవ్వేషాలు వెయ్యను.

"ఎప్పుడు?"

"ఇంకెప్పుడూనూ"

"మరేం చేస్తావు?"

"మీరు చెప్పండి"

"అయితే ఆ వుత్తరం ఇలా ఇచ్చెయ్యి" సుందరం బహు మర్యాదగా ఇచ్చేశాడు.

"కూర్చో" అన్నాడు వీర్రాజు.

సుందరం కూర్చున్నాడు.

వీర్రాజుకూడా కూచున్నాడు.

"సుందరం - నువ్వు మంచివాడివని నాకు తెలుసు. నువు చెడిపోతే నాకు పోయేదేం లేదు. కాని హఠాత్తుగా ఊడిపడి ఇక్కడ నీ పని కానిచ్చుకోడానికి రాజకీయాలు తయారుచేసి మాకు ఆటంకం వచ్చావు. అందుకని ఇంత గొడవ జరిగింది"

"నిజమే. తప్పే"

"తప్పా ఒప్పా మనం కాదు చెప్పేది"

"అవును. మనం కాదు చెప్పేది"

"నిజం దేవుడు చూస్తాడు. నే చెప్పేదొకటుంది. మనం శత్రుత్వం వదులుకుందాం. నువ్వు సుబ్బలక్ష్మిమీద ఆశ వదులుకో. మనం స్నేహితులవుదాం. నీకు శక్తి వుంటే మా బంగారయ్యవద్ద వెయ్యికాదు. పదివేలు తీసుకో. ఒకటికాదు పదిసినిమాలు తియ్యి. అది నీయిష్టం. నీవి గాలిమేడలో గట్టి మేడలో నీకే తెలియాలి. నీఇష్టం. ఎటొచ్చీ కల్లబొల్లి కబుర్లాడి వెధవ్వేషా లెయ్యకు."

"కాదులెండి" అన్నాడు సుందరం తలవంచుకుని.

"ఏమిటికాదు?"

"అదే - నేను సినిమాలు తియ్యదలచుకో లేదు.

"ఏం - నాటకాలాడిస్తావా?"

"చచ్చిన పాముని ఇంకా బాదకురా రాజూ" అన్నాడు రామారావు కలగజేసుకుని. అంతలోకే నాలుక్కరచుకొన్నాడు తేలిగ్గా - తప్పు గ్రహించుకుని. మసక చీకట్లో సుందరానికది కనబడలేదు.

వీర్రాజుకిమాత్రం వినయంగా జవాబిచ్చాడు సుందరం. "అది కాదండి - సినిభాయ్ నాకు టోకరా ఇచ్చాడండి" అన్నాడు.

"బ్రదర్! - ఇంక నువ్వు నన్ను అండీ గిండీ అనక్కర్లేదు. ఏమోయ్‌అను - చాలు మనం ఫ్రెండ్సయిపోయాం"

సుందరం సంతోషపడిపోయాడు. "ఇందాకా మీరు ఖలుడన్నారే. అది సరిగ్గా వాడికి సరిగ్గా సరిపోతుంది - ఆ సినీభాయ్‌కి"

"ఏంచేశా డేమిటి?"

"మీరు నా సంగతి సూచనగా చెప్పారటగా డబ్బు చులాగ్గా రాదని. దాంతోటి వాడు నా కనుమరుగవ ఈ ఊళ్లో దీపంవంటి కుర్రాడికి టోపీవేసి మద్రాసు ప్రయాణం కట్టించాడండి. పైగా యీసంగతేం చెప్పకండా నాదగ్గర రైలుచార్జీలు వసూలుచేసి పుచ్చుకున్నాడండి. ఊరిపొలిమేరలో చూద్దునుకదా అబ్బాయి నాయుడు

# ఇద్దరమ్మాయిలూ - ముగ్గురబ్బాయిలూ

గారబ్బాయి ట్రంకు పెట్టితో సహా అక్కడున్నాడు. నిద్దీసి అడిగితే నిజం బయటపడింది. అక్కడి పెద్దవాళ్ళతో తేరాలాడి ఆ పైన మళ్ళీ ఇంటికొచ్చి నాయుడిగారిచేత సినిమాకి పెట్టుబడి పెట్టిస్తాట్టండి-అన్రాడు. చాలా శ్రమగా చెప్పాడు సరే కథవిని — వీరా సినీభాయ్-అయితే నేనూవస్తా. ఇక్కడ డబ్బు సాధ్యపడేట్టులేదు. నాయుడిగారబ్బాయి ఎలాగా పేపరు పెడతాడుగదా. ఎలాగా ఫిలింతీస్తాడుగదా, నేను ఆ పేపరులోనూ, ఆ సినిమాకీ కథా.అదీరాస్తానన్నా అపటాన, వాడు నన్ను పురుగుని చూసినట్టుచూసి, పురుగు నవ్వినట్టునవ్వి— చెన్నపట్నంలో మాకు కవులే తక్కువయ్యారా పైగా నేను లేనా నీకన్నా బాగారాస్తా అంటూ నీ మొహం—నువ్వేం రాస్తావ్ అన్నాడండి. వాడే, ఆనోటితోనే కిందటివారం నన్నూ నా కవిత్వాన్నీ తెగపొగిడాడండి......"

"ఖావుంది" అన్నాడు వీరాజు నిట్టూర్చి.

"నేను మళ్లా మద్రాసెళ్ళి నా వుద్యోగంలో నేను చేరదలచుకొన్నానండి"

"అక్కడ ఉద్యోగంవుందా మీకు?" అన్నాడు రామారావు.

"ఆఁ! మందులకంపెనీలో సేల్సుమెన్ని. వందా యాభైఇస్తారు.

"బ్రదర్ — ఇవి కాళ్లుకావు—చేతు అనుకో" అని సుందరం భుజాలు పట్టుకున్నాడు వీరాజు" నిన్నుగురించి నేనిందాకా జొత్తిగా ఖండాలంగా మాట్లాడా అంతా వినేవుంటావు. దయచేసి అవన్నీ చెరిపెయ్యి నీకసలు ఉద్యోగంకూడా లేదనుకున్నా" అన్నాడు.

"దానికేంలెండి మాన్లైలు సెలవపెట్టి సినిమాల్లో తిరుగుతున్నా. ఇంతకన్నా హీనంగా 'మాట్లాడతా రక్కడివాళ్లు. మాటలు దులిపేసుకుని మర్చిపోటం అలవా టయిపోయిందండి" అన్నాడు సుందరం తల వంచుకుని.

రామారావుకీ వీరాజుకీ మాట్లాడ బుద్ధెయ్యలే. బాధవల్ల.

"మద్రాసు ఎప్పుడెళతారు?"

"నాకంతా అయోమయంగా వుంది. చేతిలో గవ్వలేదు. ఈసినీభాయ్ నిమాకాక బాబయ్య (బంగారయ్య)కి నామీద అనుమానం తగిలింది. రైలుచార్జీలుకూడా ఇచ్చేట్టు కనబడ్డంలేదు"

వీరాజుకో చిన్న అనుమానం తగిలింది. "మరి ఇవాళ సినీభాయ్ ఛార్జీ లెలా ఇచ్చావ్?"

సుందరం సిగ్గుపడ్డాడు. తలవంచుకుని రాతినేల మీద బొమ్మలు గీశాడు చూపుడు వేలితో.

"ఫరవాలేదు. ఇష్టంలేకపోతే చెప్పొద్దు. మేమేం అనుకోం."

"అబ్బే! అదేం కాదండి. నాకు సిగ్గేస్తోంది వాడే-ఉన్నపళంగా వెళ్లాలి. రైలు ఛార్జీలు తేఅని పీకలమీద కూర్చున్నాడు. నాదగ్గర లేదు. ఎవరూ అప్పివ్వరు. అన్నా. వాడే అయిడియా ఇచ్చాడండి. -నాకలాంటి ఊహే లేదు. జగన్నాథంగారిని అప్పుకింద అడిగి తెమ్మన్నాడండి."

"ఎవరూ? సుబ్బులితండ్రినే! మీ కాబోయే మావగారినే?" అన్నాడు రామారావు ఆశ్చర్యంతో.

"కాబోయే మావగారు కాదులెండి. ఇంకకాదు. ఇందాకనే పరువు కాస్తా పోయింది. నాకూ అంతకన్నా ఇష్టంలేదు."

"ఎలా అడిగావయ్యా - ఆయన దగ్గర ఆట్టే డబ్బుండదుకూడా!" అన్నాడు వీరాజు.

"ఏం చెయ్యనండి! ఈ సినీభాయ్ తందనాలాడి పోతున్నాడు. వచ్చిరాగానే మీతో నాపురాణం అంతా చెప్పేశాడు. ఇంకెవరితో చెప్తాడో అని భయం. పైగా మాబాబాయి పీమాల తీసుకున్నాడు - వీడెవడ్రా అని. అందుకని-వాడే చెప్పాడు. రేపు పిల్లనిచ్చేవాడు కదటోయ్. ఆయన్నే ఓపాతిక రూపాయలిమ్మను. ఎల్లుండిచ్చేస్తానని చెప్పు. లేపోతే పెళ్ళికిచ్చే కట్నంలో అడ్వాన్సుగా జమ కట్టుకోమను - అన్నాడండి"

"సుబ్బుల్ని అడగనులేదు-నయమే!"

"అన్నాడండీ - ఆమాటా అన్నాడు - స్త్రీహృదయం. నీకు తెలీదు. డబ్బు కాదు - ప్రాణంకూడా ఇస్తుంది - అన్నాడు. నేనే తిట్టాను. సరే చివరికి చేసేది లేక పాతిక అడిగితే లోకువ అని మర్యాదకోసం ఓఏభై ఇవ్వండి - రేపు మావాడు పట్నం వెళ్ళగానే టెలిగ్రాం మనియార్డరు చేస్తాడు. ఎల్లుండిస్తా అని చెప్పానండి - సగం చచ్చి. పాపం ఆయన ముందు నివ్వెరబోయి, తమాయించుకుని - ఓ అరగంట తరవాత రావోయ్. అన్నారండి. నేను మాయింటి కెళ్ళి లోపల కూచున్నా - ఆయనొచ్చాడండి మాయింటికి! ప్రాణాలెగిరిపోయాయి చెప్పేస్తాడేమోనని ఆయన పుణ్యమా అని అలాటిదేం చెయ్యకండా 'బంగారయ్యగారూ. ఓ ఏభై వుంటే యివ్వండి ఎల్లుండిచ్చేస్తా' అని మాబాబాయిని అడిగాడు. మా బాబాయి నన్నే పిలిచి 'పిన్ని నడిగి ఓ ఏభైపట్రా సుందరం' అన్నాడండి. వీరాజుగారూ నాస్థితి ఆలోచించండి. పాడు మొహం వేసుకుని ఆడబ్బు లోపల్నించి తెచ్చి బాబాయికిచ్చా. బాబాయి జగన్నాథంగారికిచ్చాడు. పావుగంట తరువాత, పూర్తిగా చచ్చిపోయి, ఆయేభై ఆయనింటికెళ్ళి తీసుకున్నానండి. నేనేం అనుకుంటానో అని ఆయన ఎంతో నొచ్చుకుని 'ఏమోయ్ సమయానికి లేక మీబాబాయినే అడగాల్సి వచ్చిందోయ్. మరోలా అనుకోకు' అని ఎంతో ఇదైపోయాడండి. నాకు నిజంగా ఏ పొచ్చింది. ఎలాగో బయటబడి సినీభాయ్ గాడికి పాతిక రూపాయలు చేతిలో పెట్టాను. ఉత్తరక్షణంలో వాడు నన్ను కాలదన్ని నాయుడుగారబ్బాయిని లేవదీసుకుపోయాడు."

ఎవరూ మాట్లాడలేదు. అయిదు నిమిషాలు గడచిపోయాయి.

వీరాజే మెల్లిగా అన్నాడు—"నిజం చెపుతా-సుందరంగారూ — ఇందాకా మీరు శుద్ధ వెధవలూ, రౌడీలూ అనుకున్నా. ఇంత అమాయకులనుకో లేదండి. నిజంగా మీ స్థితి చూస్తే గుండె కరిగిపోతోంది. ఏం చెయ్యాలో తోచటంలేదు."

రామారావు తెగించి త్యాగం చేశాడు. "సుందరం బాబూ. మీరు నాఅంత అందంగాను ఉంటారు...ఆ. నేనీ మాట గట్టిగా చెప్పగలను. మీరు సుబ్బులక్ష్మిని వివాహం

చేసుకోండి. నేను సంతోషంగా వచ్చి అక్షింతలు వేస్తాను. ఆ. నేను ఇవాళ చెప్పే ఈ మాటలు హృదయంలోంచి వచ్చాయి సుందరంబాబూ." అన్నాడు.

"వీడు శరత్ బాబు కథ ఏదో తెలుగులో చదివొచ్చాడు. లేపోతే ఇలాటి వాక్యాలు రావు" అనుకున్నాడు వీర్రాజు మనసులో.

తపోభంగం చేయవచ్చిన అప్సరసని చూసి, సర్వజ్ఞుడూ సాధుమనస్కుడూ అయిన ఋషిపుంగవుడు నవ్వినట్లు సానుభూతీ, వైరాగ్యం సమంగా మేళవించి మెత్తగా జాలిగా బాధగా నవ్వాడు సుందరం.

సారథి కట్టిన సందర్భంలో ఉడత సాయ పడ్డప్పుడు రాముడి ముఖం జ్ఞాపకం వచ్చింది వీర్రాజుకి.

"రామారావుగారూ— మీ ఔదార్యానికి నిజంగా కృతజ్ఞుణ్ణి. మీ హృదయం ఎంతగా ద్రవించిపోతోందో నాకు తెలుసు—కానీ ఇంకొక్క నిజం చెప్పేస్తే నా మనసు ప్రక్షాళితమవుతుంది."

"రామ రామ! వీళ్లిద్దరూ నవలల్లోంచి ఊడిపడి సినిమాలో దూకబోతున్నారు" అని విసుక్కున్నాడు వీర్రాజు జనాంతికంగా.

ఇలాటిది పైకి గాని అంటే ముందర జాలిగా చూసి ఇద్దరూ ఒక్కమాటు తన్ని చితకొట్టి, మళ్ళీ ఎందుకొట్టామా అని సిగరెట్టు కాలుస్తూ వాపోతారని వీర్రాజుకి బాగా తెలుసు.

"అదికూడా చెప్పెయ్ - పెళ్ళయిపోయిందా ఇదివరకే?"

"ఇంకా లేదు. మా కంపెనీ మానేజరుగా రమ్మాయి కాంతా నేనూ, ప్రేమించుకున్నాం. ఆయనా సరేనన్నాడు. ఇంతలో నేను సినిమాల గోలలోపడి సెలవు పెట్టి వాళ్ళకి కనబడకుండా తిరుగుతూ ఇలా వచ్చా. ఈ సుబ్బులు సంబంధం యాదృచ్ఛికంగా తటస్థపడింది. సినిమా గోలకొద్ది కట్నం గిడుతుందనే పాడు ఊహతో ఏదైతేనేంలే ఈ పిల్లనే చేసుకుందామని ఒప్పేసుకుని సిద్ధపడ్డాను. కాని కాంతకు చేస్తున్న ద్రోహం మానవాధమునిలా ప్రవర్తించిన నాయొక్క మనస్సుని పీకుతూనే వుంది."

"రైటో! ముందు మీరు మద్రాసెళ్ళి ఉద్యోగంలో చేరి హాయిగా పెళ్లాడెయ్యండి. మావాడు సుబ్బులుకోసం తపస్సు చేస్తున్నాడు. ఏదయితేనేంలే - మీ మావ చెప్పినట్టు కరణంగారమ్మాయి సీతని చేసుకోరా బాగుంటాయీ అంటే చచ్చినా కుదరదంటున్నాడు సరే కదా అని దరిమిలాను సీతా నేనూ పరస్పరం హృదయాలు అంకితం ఇచ్చుకున్నాం. - అన్నట్టు నువ్వు సీతకెందుకు ఉత్తరం రాశావ్?" అన్నాడు వీర్రాజు.

"మీరు క్షమించాలి. రెండు మూడు సార్లు వాళ్ళింటికెడితే ఆ పిల్ల అదోలా చూసింది. కుడీ ఎడమా ఆలోచించకుండా లెటర్ రాశా. తరవాత సంగతి మీకు తెలిసినదే."

వీర్రాజు ముసిముసినవ్వు లాలకబోశాడు. "సీత చాలా తెలివయినదండీ. ఇంకోకత్తె అయితే పడికుప్పక్క ఆడిపోయి మీపరువూ తనపరువూ నట్టేటకలిపేదే — అచ్ఛా - ఇప్పుడు మనం ఫ్రెండ్స్ అన్నమాటేగా. మీరు రేపేనా మద్రాసెళ్లటం - ఎన్నికలెల్లుండిగాబట్టి ఆగుతారా?"

"చెప్పాకదండీ - మా బాబాయ్ డబ్బులు విదిల్చేట్టులేడు. పైగా జగన్నాథంగారికి నేను బాకీ" అంటూ నసిగాడు సుందరం.

"సుందరంగారూ" అని గొంతు సవరించుకున్నాడు రామారావు.

"ఏం లేదు. ఒకటి చెబుతా వినండి మీకు లేపొద్దున్న నేనో డబ్భైఅయిదురూపాయ లిస్తా. మీదగ్గర పాతిక వుందిగా! మొత్తం వంద అవుతుంది. ఏభై జగన్నాథంగారికిచ్చెయ్యండి. ఏభై చేతులో వుంచుకోండి. ఎల్లుండి ఎన్నికలదాకా వుండి బంగారయ్యగారు గెలవడానికి ప్రచారం చెయ్యండి బాగా. ఆయన్ని గెలిపించి మరీ రైలెక్కండి" అన్నాడు రామారావు.

సుందరం సంతోషంపట్టలేకపోయాడు. "నేను మొహమాటంలేకండా మీరిచ్చేఅప్పు పుచ్చుకుంటున్నానని ఏం అనుకోకండి. అయితే ప్రచారంఅంటారా - మీరు స్నేహితులు కాబట్టి మీ మావయ్యగారు ఓడటం నాకిష్టంలేదు. ఉత్తమమార్గం ఏవిటంటే రేపే రైలెక్కెయ్యటం"

వీర్రాజు విరగబడినవ్వాడు. "వాళ్ల మావ సంగతి నీకు తెలీదు సుందరం. ఆయన వాళ్లింటికి మొగదిక్కు. ఉద్దండుడు. ఆయనగాని గెలిచాడా కరణంగారమాంతం జలగలాపట్టుకుంటాడు-రామారావుకి తన కూతుర్నివ్వడానికి ఒప్పించమని. ఆ ఒప్పందమీదేం ఆయన వీళ్ళమావకి ఓటేయిస్తున్నాడు. అదే జరిగితే సీత నాకు దొరకలేదని నేనూ, తన నెత్తిన పడిందని వీడూ ఏడిచి చచ్చిపోతాం. మీకు ఈవూరి రాజకీయాలు తెలీవు. వీళ్ళ మావయ్య ఓడడమే మాపవిత్రాశయం. జీవితాదర్శం" అని స్పష్టపరిచాడు.

సుందరం కొంచెం ఆశ్చర్యపడ్డాడు. "సరేలెండి అదయితే సులభమే. ఇప్పటికే చాలామందిని మంచిచేసుకున్నా. వాళ్లంతా నేను సినిమాలో పెద్దవాడినని భ్రమిస్తున్నారు. అంజలి, భానుమతి, నాగేశ్వర్రావు, సావిత్రి వాళ్లందరి యిళ్లూ మావీధిలోనే ఉన్నాయని, ఇక్కడ వీళ్ళతో మాటాడేసినట్టే అక్కడ వాళ్లతో మాటాడేస్తాననీ, యన్. టి. రామారావుని

# ఇద్దరమ్మాయిలూ - ముగ్గురబ్బాయిలూ

స్వయంగా సొంతచేత్తో ముట్టుకున్నాననీ చెప్పా. బస్తీవాళ్లలా వేపాలిప్పించమని వాళ్ళడగలేదు కానీ నేనంటే గౌరవం ఉంచారు లెండి" అన్నాడు.

"అచ్ఛా! రైట్! నువ్వింక వెళ్లు సుందరం రేపొద్దున ఈసరయ్య హోటలుకిరా. డబ్బు సిద్ధం చేస్తాం." అన్నాడు రామారావు. సుందరం వెళ్లిపోయాడు.

రామారావూ వీర్రాజూకూడా ఇళ్ళకి బయల్దేరారు. చీకట్లో సిగరెట్లు కాల్చుకుంటూ.

"భలే రోజురా!" అన్నాడు వీర్రాజు విలాసంగా.

"ఔనుగాని ఇంత పొగరుమోతునిపిల్లిలా చేశావుగదా-ఏమిట్రా ఆపకోడీమంత్రం?"

"చెప్తే మజాలేదు"

"ఏడిశావు చెప్పు చెప్పు"

"ఇందాకా పెద్దమనుషులొచ్చారన్నానే - అందులో సుబ్బిశెట్టి లేడూ - సుబ్బిశెట్టి - ఈసరయ్య హోటల్లో కూచుని ఈ సుందరాన్ని సినీభాయ్‌నీ చూసి కంట్రాక్టరుతో చెప్పుతున్నాడు. నే విన్నా. ఈ సుందరం నాలుగేళ్ల క్రితం బాక్సీ హాలులో పకోడీ లమ్మేవాడట! పువ్వు పుట్టగానే పరిమళిస్తుందని - వీడికి చిన్నప్పటినుంచీ పాఠశాలకన్నా సినిమాశాల లంటే అభిమానం మెండు. నాడియావారి వాడియా నాటినుండి ఎడతెరిపి లేకండా సినిమాలు చూసేవాడట. రోజూ వెళ్ళడానికి డబ్బు లెవరిస్తారు? అందుకని ఓ పకోడీల మామ్మ తాలూకు మనవడితో నేస్తం కట్టాడట. వాడు మామూలుగా హాలులో పకోడీ లమ్మేవాడన్న మాట. వీడి సినిమా ఉబలాటం కోసం ఓ చిన్న జంగిడిలో పది జంతికలూ పదమూడు పకోడీలూ వేసి సుందరానికిస్తే ఆ జంగిడి చూపించి వీడు హాల్లో దూరేవాడట. గేటు కీపరు చూస్తూన్నపుడూ, సినిమా మధ్యలో హాలు సాంప్రదాయం ఆనవాయితీ ప్రకారం కట్ అయిపోయి దీపాలు వెలిగినపుడూ ఇంటర్వెల్‌లోనూ అమాంతం లేచి నుంచుని 'పకోడీ' అని ఓ గావు కేకేసి చటుక్కున కూచునేవాట్ట. సరే వాడిదగ్గర కొన్నవాళ్లు కొనేవారు. వీడు సినిమా చూసేసేవాడు."

"కుర్రాడు గాబోలు అప్పుడు!"

"కుర్రాతేం తెసులు. పదిహేనేళ్లుట అప్పుడు - సుబ్బిసెట్టి చెప్పాడు. అక్కడితో అయితే బాగానే వుండేది. అమ్మగా వచ్చిన అణా బేడా, ముసలమ్మ ఇచ్చిన పకోడీలూ జంతికలూ చాలా భాగం, వీడే తినేశేవాడట. అదంతా ముసలమ్మ లెక్క కట్టింది. అప్పు బాగా నాలుగైదు రూపాయలదాకా పెరిగిందట. ఇంతలోకే ఓ నాడు వీడు ఇంకో కుర్రవాడితో లాలూచీ అయి, ముసలమ్మ ఇంట్లోంచి పాతిక రూపాయలు కొట్టేసి మెడ్రాసు చెక్కేశాడు. నాటికీ నేటికీ పత్తాలేడట. ముసిల్దీ దాని మనవడూ ఇంకా బతికేవున్నారు - వాడు కనబడితే తందామన్న. అభిలాషతో అందికే వాడికి నేనిందాక పకోడీల ముసల్ది వచ్చిందనగానే హడలెత్తి పిల్లికూనయి పోయాడు పాపం."

రామారావు చప్పగా నవ్వాడు.

"అనవసరంగా చాలా హింస పెట్టావు పాపం....సరేలే అంతా మన మేలు కోరకేనన్నారు. ఈ పకోడీలగోలలేపోతే కథ అడ్డం తిరిగేది."

"మర్చిపోయాం - అవునుగానీ ఓరిరామం చవటా - సుందరానికి తెల్లారేసరికి డబ్భై అయిదురూపాయలిస్తానన్నావు. ఎలా తెస్తావురా" అన్నాడు వీర్రాజు హాఠాత్తుగాఆగి.

రామారావు నిశ్చలంగా జవాబిచ్చాడు. "వాడు నా కోసం సిడ్నీ కార్టనంత త్యాగంచేసి సుబ్బుల్ని వదిలేస్తున్నపుడు, నేనీమాత్రం సాయం చెయ్యద్దురా? వాడలా చెయ్యకపోతే నేను సీతని చేసుకుంటును నీనోట్లో కరక్కాయపడి ఉండును. మన తల తాకట్టుపెట్టైనా వాడికి డబ్బివ్వాలి "

"నాతల తాకట్టు పెట్టక్కర్లే - కావలిస్తే నీతలే పెట్టుకో" అన్నాడు రాజు.

"లాభంలే. నాది పనికిరాదు. ఇపుడు నీతలే తాకట్టుపెడుతున్నా. ఆ ట్టే గోల చెయ్యకు. సుందరం మళ్లా నెల్లాళ్ళలో డబ్బు పంపెయ్యగానే విడిపించేద్దాం"

"ఎన్ని?"

"నీతలకాయని - నీ క్కావాలని మా అమ్మని అడగబోతున్నా. నోరు మూసుకు చూడు" అన్నాడు రామారావు నవ్వుతూ.

వీర్రాజేదో అనబోయాడుగానీ ఇల్లుదగ్గర కొచ్చేశారు.

రామారావు తల్లి గుమ్మందగ్గర కూచుంది.

"ఎక్కడికెళ్లావురా నాయనా. అర్ధరాత్రయినా పెత్తనాలేనా? ఎలాచావనురా-" అంటూ లేచిం దావిడ.

"లోపలకి పదమ్మా. అర్జెంటుగా మాటాడాలి" అన్నాడు రామారావు గంభీరంగా.

పట్టింట కూచున్నాక సంగతి చెప్పాడు "వీర్రాజుకి తలతీసే ప్రమాదం వచ్చింది. అందుకని అర్జాంతరంగా వంద రూపాయలు కావాలి. మళ్ళా నెలాఖరునాటికి ఇచ్చేస్తాడు." అన్నాడు టూకీగా వ్యవహారదక్షుడల్లే.

"అయ్యో! దానికేం. అమాత్రం సాయానికేం బాబూ. మీ అమ్మ నాకు తెలీదా ఏం. ఇబ్బం దొచ్చినపుడు..."

"అది కాదమ్మా. వాళ్లమ్మకి తెలీదు. పట్నంలో పని ఇది. వీడి పరీక్షకి మార్కులు తక్కువొచ్చాయి. వంద రూపాయిలిస్తే పాసైపోతాడు. తరవాత వాళ్ళమ్మకి మెల్లిగా చెప్పి నీకు బాకీ తీరుస్తాడులే. ఇపుడు నీకూ నాకూ తప్పితే మూడో చెవిని పడరాదు."

రామారావు తల్లి రెండు నిమిషాలసేపు తలవంచుకుని ఆలోచించింది. "సరే అలాగే నాయనా—" అంటూ లేచి ఇనప్పెట్టె తెరచింది. పది పదులు లెక్కపెట్టి రామారావు కిచ్చింది. రామారావు మళ్ళీ లెక్కెట్టి రాజు కిచ్చాడు. అంతవరకు కొయ్యబొమ్మల్లే ఈ నాటకం చూస్తున్న రాజు

డబ్బు చేత్తో పుచ్చుకుని "మీ మేలు మర్చిపోనండి పిన్నిగారూ. సంకురాత్రిలోగా తిరిగిచ్చేస్తా" అంటూ లేచాడు. రామారావు గుమ్మందాకా దిగబెట్టే నెపంతో వెళ్ళి వీర్రాజుదగ్గర డబ్బు తీసుకుని జేబులో పెట్టుకున్నాడు. "పొద్దున్నే రా—ఎన్నికల ప్రచారం చేద్దాం. ఇంక వెళ్లు" అని సాగనంపి అన్నానికొచ్చాడు.

"చాలా సంతోషపడ్డాడమ్మా వెర్రిబాగులాడు" అన్నాడు రామారావు అన్నం తింటూ.

"ఏం బాగో నాయనా. నాకు నీ పద్ధతీ, మీ మావయ్యగోలా చూస్తే మతిపోతోంది. ఇద్దరూ కలిసి కొంప గుండం చేసేట్టున్నారు ...అదేం తిండిరా కోడి కెక్కిరించినట్టు. అప్పులే. ఇంకా సింగరెట్లు కాల్చు. తిండి బాగా వంటపడుతుంది."

"మావయ్యేం చేశాడే?" అన్నాడు రామారావు.

"ఏం చేస్తాడు. వాడికి చేతనైంది వాడు చేస్తున్నాడు ఎన్నికలన్నాడు. ఏదోగోలన్నాడు. పొద్దున్న పాతికరూపాయలు తీసుకున్నాడు. మధ్యాన్నం పెద్దమనుషులొచ్చారన్నాడు. వాళ్లను తెచ్చి ఊహూ మంతనాలాడేడు. మళ్లా వాళ్లంతా వెళ్లారు. ఇందాకొచ్చి తైతక్కలాడాడు. అకాణ్ణించీ మీ నాన్న పంచెలు మూడూ, నల్లకోటూ, కండువా, రెండుచొక్కాలూ పట్టుకపోయాడు"

"ఎందుకూ?" అన్నాడు రామారావుకళ్లు పెద్దవి చేసి.

"ఎందుకేమిటి నాయనా. అంతా నా ఖర్మకి. ఒక్కటే సవ్యంగా ఏడిచిందా. మధ్యాన్నం వచ్చిన పెద్దమనుషులు ముగ్గుర్నీ ఇందాకా కాలవొడ్డున ఎవరో దొంగలు అటకాయించి దోచుకున్నారట. గోచిపాతకూడా లేకుండా గుడ్డాగుడుసూ ఊడ్చుకు చక్కాపోయారట"

రామారావు కర్థం అయింది. విరగబడి నవ్వసాగాడు. "మావయ్యకూడానా?"

"కాదు ఈనగారు ఎక్కడో పూరేగి కాలవ గట్టుకెళ్ళేసరికి పెద్దమనుషులు ముగ్గురూ కాలవలోనించునీ ఏడుస్తున్నారట. దొంగలుదోచుకున్నారు. పంచెలు తెమ్మన్నారట. మీ మావయ్య ఇంటికొచ్చి పెద్దమనుషులు పెద్దమనుషులంటూ మీ నాన్న బట్టలు తీసుకుపోయాడు. ఆయనే ఉంటే..." అని కంటనీరెట్టుకుంది సూరమ్మగారు.

రామారావు మాట్లాడలేదు. భోజనం కానిచ్చి సావిట్లో కొచ్చేసరికి పెద్దమనుషులూ మావయ్యా బిలబిల్లాడుతూ లోపలికొచ్చేశారు.

మావయ్య వంటింట్లోకెళ్ళి "ఒక్కశేరు బియ్యం ఉడకేసిపెట్టు చెల్లీ పెద్దమనుషులొచ్చారు" అని పురమాయించి చెల్లెమ్మ మాట వినకుండా సావిట్లోకొచ్చేశాడు.

"అంతేనయ్యా. బంగారయ్యే చేయించి ఉంటాడీపని. అంచేత మీరు తప్పకుండా రేపుఉండి నన్ను గెలిపించాలి" అన్నాడు మావయ్య సూరయ్యగారు.

"చాల్పెల్లేవయ్యా - చేశావ్-మర్యాద" అన్నాడు కంట్రాక్టరు.

సుబ్బిశెట్టిమాత్రం మెత్తబడ్డాడు. "ఎర్రిబ్యామ్మ డాయనమీద ఎగిరితే లాబమేటయ్యా. ఆ దొంగదవళ్ని ఈన పిల్చుకొచ్చాడాయేం!" అన్నాడు.

"సూరయ్యగారూ" అని బయటకేక వినబడింది.

రామారావెళ్ళి తలుపు తీశాడు. "ఈసరయ్య ఒచ్చాడు మావయ్యా" అన్నాడు.

ఈసరయ్య లోనికొచ్చాడు "సూరయ్యగారూ మీరు గెలవకపోతే లాభంలేదు. గెల్సి తీరాల్సిందే" అన్నాడు వస్తూనే.

సూరయ్య విస్తుపోయాడు హఠాత్తుగా వచ్చిన ఈసరయ్య పేనుకి.

"ఏమిటోయ్ కథ?" అన్నాడు విలాసంగా.

ఈసరయ్యకథ ఏమిటో చెప్పాడు. ప్రత్యర్థి బంగారయ్య తనకి ఓటిస్తే రామాలయం ఊరినడిమధ్యని కట్టిస్తానని అప్పుడే అందరికీ చెప్పి ఓట్లు కూడబెడుతున్నాడట. పైగా ఆయన బంధువు సుందరం ఓడు సిల్కు చొక్కా వేసుకు మరీ ప్రచారం చేస్తున్నాట్ట.

సూరయ్య ఒక్కసారిగా గంయ్‌మన్నాడు. "చూశారయ్యా పెద్దమనుషులూ - నేను మాటవరసకి నిన్ననే కరణంగారి అరుగుమీదకూచుని ఈముక్క అన్నా - రామాలయం ఊరుమధ్యగా శివాలయం దగ్గిరలో నేకట్టిస్తె బాగుంటుందని. ఆమాట ఆనోటా ఆనోటా విని ఇపుడు అది తన ఊహ అయినట్టు చాటిస్తున్నాడు బంగారయ్య. చూడండయ్యా-హుఁ!" అన్నాడు. పెద్దమనుషు లెవరూ మాటాడలేదు. ఈసరయ్యే కొంచెం మూలిగి మొదలెట్టాడు. ఊరి చివర తన కాఫీ హోటలుంది కాబట్టి రామాలయం కూడా అక్కడే కట్టించడం మంచిదని ఈసరయ్య గట్టిగా అభిప్రాయపడ్డాడు. హోటలికొచ్చే జనం రామమందిరంలోకీ రావచ్చు. మందిరాని కొచ్చే జనం తన హోటలుకీ రావచ్చు.

కంట్రాక్టరు కిది సబబుగానే తోచింది. 'మంచిదే' అన్నాడు. సెట్టికి యింకా పెద్ద ఊహ పోయింది. "ఈసరయ్యా, మాటవరసకి అడుగుతాగానీ - నువ్వు ఓ కిరాణా దుకాణం కూడా అక్కడెట్టరాదూ?" అన్నాడు.

సూరయ్యగారు కలగచేసుకున్నాడు. "మీకు తెలీదు లెండి. ఊరిమధ్య మా సరమ్మ దుకాణం ఉంది. ఉప్పూ పప్పూ అంతా అక్కడే కొంటారు. ఇక వీడు ఊరి చివర పెడితే ఎవడొస్తాడు" అన్నాడు.

"దానికే ముందయ్యా బ్యామ్మ్యడా! ఊరి చివరాళ్లే వత్తారు. నువు చెప్పిన దుకాణం కన్నా ఓ దమ్మిడీ తగ్గించిస్తే ఊరి మద్దోళ్లు కూడా వత్తారు. దానికేటి: ఊరె ఉండాలి కాని. ఏమంటావు ఈసరయ్యా - నువ్వు ఊఁ అను. నేను బస్తీనుంచి నీకు వారం వారం సరకు పంపిత్తా అమ్మకో వచ్చే పావలా డబ్బుల్లో బేడ నీకూ బేడ నాకూ. నాయంగా యిద్దరం తిందాం" అన్నాడు సెట్టి.

ఈసరయ్య ఎగిరి గంతేశాడు. "అంత కన్నానా" అన్నాడు.

కంట్రాక్టరుకి కొత్త ఊహ తోచింది. "ఊరు పెరుగుతుంది. నలుగురూ ఇళ్లు కట్టుకొంటారు. అనక అదే నడిమధ్యవుతుంది. ఈసరయ్య ఆనందం పెల్లుబికింది "సూరయ్యగారూ దల్లకొచ్చి ముంతదాచడమెందుగ్గానీ ఓ పేమాట చెప్తా. మీరుగనుక రామ్మందిరం ఊరిచివర కట్టిత్తానని మాటిస్తే రైతు కుర్రాళ్లఓట్లు, పాలేరాళ్ళ

వాలయం పూజారి కూతుర్ని గవరయ్య తన కొడుక్కి చేసుకుందా మనుకుంటున్నాడు. అందుకని ఈ ఊళ్లో పూజారి పార్టీ ఓట్లు సూరయ్యగారికే ఇప్పిస్తానన్నాడు.

"రాముడూ. కాళ్లు కడుక్కో వచ్చని చెప్పరా" అంది సూరమ్మగారు వంటింట్లోంచి.

భోజనాలయాక సూరయ్య, సెట్టి, ఈశ్వరయ్య, కంట్రాక్టరూ, గవరయ్య కరణం గారింటికెళ్లి సంగతి చెప్పారు. రామమందిరం ఊరిచివర కట్టించడానికి నిశ్చయం అయిందని, కరణంగారేమంత ఉత్సాహం చూపించలేదు. తనతో మాటమంతీ లేకుండా సూరయ్య తక్కినవాళ్లతో లాలూచీ అయి నిర్ణయాలు చేయడం ఆయనకి నచ్చలేదు. "సరే కానియ్యండి" అన్నాడు చప్పగా.

"మీ అండ మాకుండగా గెలుపు సందేహం ఏముందండీ" అన్నాడు వెకిలిగా సూరయ్య.

"ఆ! మా దేవుందిలెండి. ఏదో చిన్నవాళ్లం." వెక్కిరింపుగా గొణిగాడు కరణంగారు.

సూరయ్య, వినపడ్డా వినిపించుకోలే.

"ఎంతమాట! సెలవు — వస్తా"— అన్నాడు.

తెల్లవారింది. సూరయ్యగారూ, ఆయన బృందం ఓ పక్క, బంగారయ్య సుందరం ఓ పక్క బయల్దేరి మనిషి మనిషినీ మాలీసు చేసి మంచి చేసుకోసాగారు.

మెడమీద తలవున్న పెద్దలు నలుగురూ చప్పరించారు. ఏదో దీనికి ఎన్నికలేమిటి - ఎందుకు పార్టీలూ ప్రచారాలూ అని.

రామారావూ, వీర్రాజూ విడిగా ఓ పార్టీ అయ్యారు. "సూరయ్యగారికి మీరు ఓటివ్వకండి. ఊరు చివర రామాలయం ఏమిటి— నా తలకాయ! మా మావయ్యయితే నేం, నేను నిజమే మాట్లాడుతున్నా" అని కనబడ్డ వాళ్లతో అన్నారు.

కరణంగారికీ సూరయ్యగారికీ ఈ సంగతి తెలిసి మండిపడ్డారు. "బుద్ధి లేపోతే సరి పెద్దవాళ్లం ఒకపక్క నలుగుర్ని ఆకట్టుకో లేక ఛస్తాంటే మధ్య పుల్లవిరుపుమాటలేమిటి' ని.

బంగారయ్యగారు మధ్యాహ్నానికి కొత్త రకం ప్రచారం లేవదీశాడు—రామమందిరం ఊరి మధ్యన కట్టించడమే కాకుండా దానికి వెనకాలవేపు వేరే ఓ పాక వేయించి అక్కడ చదరంగం అదీ ఆడుకోడానికీ, నవల్సా నాటకాలూ చదువుకోడానికీ, లోకాభిరామాయణానికీ ఏర్పాటు చేయిస్తానని, హరికథలూ, పురాణాలూ జరపడానికి చిన్న చెక్కబల్లల స్టేజీ కట్టిస్తానన్నాడు.

సుందరం సిల్కుచొక్కాలు ఆ ప్రచారానికి కొంత తోడ్పడుతున్నాయని సూరయ్యగారి మతాకి హఠాత్తుగా తట్టింది.

తిరిగి తిరిగి మధ్యాహ్నం ఇంటికొచ్చేసరికి రామారావూ వీర్రాజూ పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వుకుంటున్నారు. "నీ కూ బెబెబ్బే నీ తాతకూ బెబ్బెబ్బే అన్నట్టు గొంగరాముడు అండుకో వారు బస్తీ పెద్ది మనుషుల్ని దోచుకుని పత్తా లేకుండా పారిపోయారు. వాళ్లకి పదిరూపాయలు బజానా యిచ్చి ఆస్థాన చోరులుగా ఉండమనకోబోయిన వీర్రాజుకీ రామారావుకీ కూడా ఎగనామం పెట్టారు.

సూరయ్యగారు సావిట్లో అడుగు పెడుతూనే మండిపడ్డాడు "ఏరా రాముడూ. నాకు వోటివ్వద్దని ఊళ్లో అందరికీ చెబుతున్నావుటగా? బుద్ధి లేదూ? సుందరంగాణ్ని చూడు. వాళ్లకోసం ఒక్కలా తిరుగుతూ నోరు పడిపోయేట్టు ప్రచారం చేస్తున్నాడు, సిల్కు చొక్కా తేసుకుని. వాణ్ణి చూసేనా సిగ్గుతెచ్చుకో" అని గసిరాడు రామారావుకి కోపం వచ్చింది. "మావయ్యా నువ్వు నెయ్యి చెప్పలక చెప్పు. నేను నీ తరఫున ఒక్క మంచి ముక్క అనను. ఇంకదేనికేనా అయితే ఏమోగానీ ఈ విషయంలో మాత్రం నాకు తోచిందే నేను చాగుతాను. నా యిష్టం. నీకొక్క్షం వచ్చినా, అమ్మకి కోపం వచ్చినా సరే" అన్నాడు.

"ఏమిట్రా అపాగరు ఏం చూసుకుని అంత మిడిసిపాటు?... విశ్వాసం లేకపోతే సరి... అయ్యో తండ్రిలేని బిడ్డగదా అని సాకినందుకు బాగానే బుద్ధి చెప్పావులే... అసలు నాదే తప్పు. గంగలో కలవండని నాదారి నేను చూసుకోవలసింది. ఛీ." అన్నాడు సూరయ్యగారు.

రామారావు ఉద్రేకంతో లేచి జవాబివ్వబోయాడు. కాని వీర్రాజు పట్టుకుని వారించాడు. ఈగోలకి వంటింట్లోంచి సూరమ్మగారు రావడంతో సూరయ్యగారు పని ఉన్నట్టు బయటికి జారుకున్నాడు.

"పిన్నిగారూ - వీడికేం తప్పులేదండీ. ఆయనే అనవసరంగా కోప్పడ్డారు" అన్నాడు రాజు.

"ఏగోలే నాయనా. ఇదంతా నా ఖర్మ. పిడికాలకం ఇది. వాడివాలకం అది. కడుపు చించుకుంటే కాళ్లమీద పడేను. ఎవరితో చెప్పుకుని ఏడిచేది బాబూ. అమారాజే ఉంటే నాకీగతి పట్టేదా..." అంటూ.

"అబ్బెబ్బే. మీరలా కంటనీరెట్టుకోకండి పిన్నిగారూ. అన్నిటికీ దేవుడే ఉన్నాడు" అన్నాడు రాజు.

రామారావు సందు చూసి చిటిక్కేశాడు "ఏం దేవుడురా. దేవుడూ దెయ్యమూను. దేవుడే ఉంటే నా కిష్టంలేనిపిల్లని ఒద్దు మొర్రో అంటే ఇలా గొత్తిన కట్టనిస్తాడా మా మావయ్యచేత"

సూరమ్మగారికి కోపం వచ్చింది. "ఏమిట్రా నీయిష్టం? ఇప్పుడు నీకొచ్చిపడ్డకష్టంఏవిటి? వంశంలో నేవెవమ్మా ఇలాటి బుద్ధులు. ఆయన వెళ్లినా ఇంకా ఈ ఘటం మిగిలింది... ఏం? కరణంగారిపిల్ల కేంతక్కువొచ్చిందిరా. అన్నీ కుదిరాయి. నేనూ మావయ్యా అనుకున్నాం. తీరా రేపు తాంబూలాలు ఇచ్చుకోబోతూ ఉంటే ఏవిటీభాగోతం? శాస్త్రం చెప్పినట్టుంది"

వీర్రాజుకి ఒళ్లంతా తేళ్లూ జెర్రులూ పాకినట్టయింది ఈ మాటలు వినగానే. బుర్రలో రక్తం పరిగెత్తాయి. అమాంతం సీత తనకిరాసిన ఉత్తరం చూపించేద్దామనుకున్నాడు నిజం చెప్పేసి. కాని పూర్తిగా తగ్గిపోయి తల వంచేసుకున్నాడు, రామారావూ తల వంచుకున్నాడు. ఇంకా వాదిస్తే అమ్మ మళ్లీ నూతిలో దూకుతాననంటుంది. ఇలాటిగోల నాలుగుసార్లు జరిగింది.

"లేరా వీర్రాజూ. అలా వెళ్లొద్దాం" అన్నాడు.

ఇద్దరూ గోడువెంట పోతూ ఉంటే తెలుకుల వీరయ్య సావిడిలో పెద్ద దీపం వెలుగుతున్నట్టు ఇద్దరికీ కనపడింది. రామారావుకి కనపడిన దీపం పేరు సుబ్బలక్ష్మి. వీర్రాజుకి గోచరించిన దీపం పేరు సీతాలక్ష్మి.

రామారావు వీర్రాజు ఆగిపోయి యమ వేగంతో ఆలోచించారు. గబగబా చెవులు కొరికేసుకున్నారు పరస్పరం.

"నీకు ఫరవాలేదురా. నేను క్షణంలో తేల్చేస్తా సంగతి. మన బంగారం, అనగా నా హృదయేశ్వరి ఉండగా భయమెందుకురా" అన్నాడు వీర్రాజు. తెలుకుల వీరయ్య సావిట్లోకి ప్రవేశించారు ఇద్దరూ. సుబ్బులూ సీతా గానుకమీద కూర్చొని తిరుగుతో కబుర్లు చెప్పుకుంటున్నారు. తెలుకుల వీరయ్య గానుగ ఆడుతున్నాడు కునుకుతూ.

"ఏం వీరయ్యా! కులాసావా?"

అన్నాడు వీర్రాజు. గానుగమీది అమ్మాయిలిద్దరూ ఉలికిపడి, గానుగ దిగిపోయారు. 'ఏదో తమ దయవల్ల ఇలా ఉన్నాం' అన్నాడు వీరయ్య. సీత పకపక నవ్వింది. "మీరా. ఎవరో పెద్దమనుషు లనుకున్నా" అంది. రామారావు ముఖం రంగు కొంచెం మారింది సుబ్బుల్ని చూడగానే. సుబ్బులు తలవంచుకుని అవతల మూలకి వెళ్ళి నించుంది. రామారావు ఇవతల మూల చిన్న అరుగుమీద చతికిలబడ్డాడు - కాళ్ళు వణుకుతున్నట్లు కనపడకుండా ఉండాలని. వీర్రాజు మాత్రం గుండె నిబ్బరంగల మనిషి. ఒళ్లు పులకరించడం, కాళ్లు వణకడం, మాట తడబడడం అతనికి రావు. లేవు. "సీతా పోస్యాల కేంగాని ఇలారా మాట" అన్నాడు తొణుకూ బెణుకూ లేకుండా. సీత కొంచెం నివ్వెరపోయింది వీర్రాజు ధీమా చూసి. ఆపైన రామారావు వంక రెప్ప వెయ్యకుండా చూసింది. సాలోచనగా ముందుకు వచ్చింది. "నీకేమైనా మతిపోయిందా రాజూ. ఎవరైనా మనని చూస్తే ఇంకేమైనా ఉందా!" అంది.

"కాదు సీతా. వెంటనే వెళ్ళిపోతాం. కాని ఒక ముఖ్యమైన సంగతి అడగాలి." అన్నాడు వీర్రాజు ప్రాధేయపూర్వకంగా.

సీత రామారావు వంక బాధగా జాలిగా చూసింది "రాజూ! నాకు తెలుసు నువ్వు చెప్పబోయేది" అని తలవంచుకుంది. "మనసులు కలవనప్పుడు మనుషులు కలవడం అసంభవం. పెళ్లి అనేది అయితే వరం, కాకపోతే శాపం. అంతే. రాజ్! నీ హృదయం ఇంత గొప్పదనుకోలేదు రాజ్! నాకు తెలుసు. రామారావు నన్ను ప్రేమించాడు. అయితే విధివశాత్తూ మన హృదయాలు కలిశాయి. అందువల్ల రామారావుహృదయం ఛిద్రమైపోయిందని నాకు తెలుసు. నువ్వు అతనిస్నేహితుడివి కాబట్టి అతని కోసం నీ సౌఖ్యం త్యాగం చేసుకుని, నా హృదయాన్ని అతనికి అర్పించమని కోరడానికి వచ్చావు...కాని రాజ్! మనసులు కలవకపోతే మనుషులు కలవరు...ఇంకేం చెప్పను. నా హృదయం ద్రవించి పోతోంది!..."

వీర్రాజుకి జుట్టు పీక్కునేపర్యంతం మతిపోయింది "ఇదెక్కడిగోల సీతా. తెలుకులాడువింటే మావాళ్లెవరో వచ్చిపోతే నువ్వు నన్ను ఓదారుస్తున్నావనుకుంటాడు...నే చెప్పేది కాస్త వినవేం ..."

"కాదులేరాజ్. నామాటకి తిరుగులేదు. నిన్నూ నన్నూ వేరుచేస్తే నూతిలో దూకుతానని మా అమ్మకి చెప్పాను"

"నిన్నూ నన్నూ దేవుడుకూడా వేరు చెయ్యడులే కాని చెప్పేది విను" అన్నాడు రాజు.

సీత వినిపించుకునే ధోరణిలో లేదు. "రాజ్! హామ్లెట్ కథ తెలుసా?....కాదు రోమియో...రోమియోకథ తెలుసుగా.... ముందర ఓకన్యని ప్రేమించాడు. విఫలుడయ్యాడు. మళ్లీ ఇంకోకన్యని ప్రేమించగానే ద్విగుణీకృతమైన ప్రేమతో ప్రేమించాడు. అమరజీవి రోమియో...రామారావుకి నువ్వు చెప్పు. వృధాగా హృదయాన్ని వ్యధ పెట్టవద్దని చెప్పు. సుబ్బుల్ని ప్రేమించమను. దానికి అతనంటే తగని ప్రేమ. ఎంత ప్రేమో చెప్ప లేను. దాన్ని ప్రేమిస్తే వాళ్ళిద్దరి జీవితాలూ .... హాయిగా...."

"హిప్ హిప్ హుర్రే" అన్నాడు వీర్రాజు అమాంతం ఎగిరిగంతు వేస్తూ. ఏటిబాబూ? అన్నాడు తెలకులవీరయ్య. 'ఏవిటి రాజ్? అంది సీత.

"ఏవిటీలేదు కోవటీలేదు .... వాడికాక్కావలసిందదే. సుబ్బులికి వాడంటే ఇష్టం ఉందో లేదో తెలుసుకుందామనే నిన్ను అడగడానికి వచ్చాం" అన్నాడు వీర్రాజు.

సీత బరువుగా నిట్టూర్చింది. "నా హృదయభారం తగ్గిందిరాజూ ... మళ్ళీ చెబుతున్నా. "సుబ్బులు రామారావుని ప్రేమిస్తోంది" అంది సీత.

"రైకో. ఫస్టుక్లాసయిన పనిచేస్తోంది... సరే. మరిప్పుడు వాడితో మాటాడుతుందేమో కనుక్కో."

"మాట్లాడదు. మనంత విశాలభావాలూ ధైర్యం లేవు దానికి....తగని సిగ్గు" అంది సీత.

"మరేంఫరవాలేదు...ఆడదానికి అందం సిగ్గన్నారు...మనసంగతి చేరనుకో...వాని వాడికేసి ఓ చిరునవ్వైనా విసురుతుందేమో అడుగు...తెల్లవార్లూ ఆనవ్వును తలుచుకుని జాగరం చేస్తాడు" అన్నాడు రాజు.

"నీకు బొత్తిగా ఒళ్లు పొగరెక్కింది రాజ్! హృదయాలతో వేళాకోళా లాడుతున్నావు."

"పోన్లే - వద్దులే. వస్తా సీతా. నీకు దేముడు మేలుచేసి నాకిచ్చి పెళ్ళిచేయిందుగాక...వస్తా వీరయ్యా మళ్లీ వస్తా." అన్నాడు వీర్రాజు బయటికి నడుస్తూ. రోడ్డెక్కగానే రామారావు నిట్టూర్చాడు హమ్మయ్య అని.

"అదృష్టవంతుడివిరా రావుడు! సుబ్బులు నీకోసం తిండీ తిప్పలూ మానేసి ఏడుస్తోందిట." అన్నాడు రాజు.

రామారావు ఆనందం అవధులు దాటిపోయింది. మాటలు రాలేదు. రాజు చెయ్యి పట్టుకుని ప్రగాఢంగా అదిమాడు.

కాసేపు ఆగి. మెల్లిగా అన్నాడు. "ఇంకో గొప్ప అదృష్టం - ఈసీత నాపాల బడకుండా నిన్ను ప్రేమించడం! ఆ హృయదం నాకే అర్పిస్తే గుండాగి చచ్చేవాణ్ణి!"

వీర్రాజు జవాబివ్వలేదు - కోపం వచ్చి.

"ఎవడ్రా వాడు. ఇతర దేవతలూ వాళ్ళూ సముద్రం చిలికిన రోజుల్లో హాలాహాలం వస్తే మింగేశాడు? ఎవరో దేవుడే."

రాజు జవాబివ్వలేదు - దీనికూడా.

"నాకు గుర్తుకు రాటంలేదు. మొత్తానికి అంత వాడివి నువ్వు. నీ కసలు అది ఎలా నచ్చిందిరా?" అన్నాడు రామారావు నవ్వుతూ.

"సీత హృదయం నీ కర్థం కాదులేరా" అన్నాడు రాజు బరువుగా.

"అందుకే ఇంత సంతోషం....కొండల్లే వచ్చిన కష్టాలు మంచల్లే కరిగిపోతున్నాయి కదరా రాజూ. దేవుడు లేడని బొత్తిగా కొట్టిపారెయ్యడానికి వీల్లేదు సుమా" అన్నాడు రామారావు విలాసంగా పొగ వదుల్తూ.

(ఇంకా వుంది)

# ఎదురింట్లో పెండ్లి

"ఆ పది రూపాయల నోటు తీసికొని బియ్యం తీసుకు రారాదూ ?" అని పలికింది మా ఆవిడ వంటింట్లోనుంచి. ఈ ఆడవాళ్ళకు ప్రొద్దున లేచినదగ్గరనుండి బియ్యం, కూరలు, పడక, నిద్ర—అంతే! ఎదురింట్లో పెండ్లిజరుగుతున్న దిగదా, వాళ్లు భోజనానికి పిలుస్తారేమో, వెళ్ళకపోతే బాగుండదే అనే ఊహకూడా లేదు మా ఆవిడకు.

"ఉండవే! నీదంతా ఒక గొడవ! కాసేపు ఉండరాదూ—ఆ యెదురింటి సూర్యనారాయణగారు పెండ్లి భోజనానికి పిలుస్తారేమో !" అన్నాను.

"ఆయన కాకికి కూడా మెతుకులు దులపరు. కనిపెట్టకోండి పాపం" అంది హేళనగా.

ఈ ఆడవాళ్లకు కొంచెమైనా లోకజ్ఞానం యెందుకు పెట్టలేదో భగవంతుడు, నాకు అర్థంకాదు. సూర్యనారాయణగారు, నేను మంచి స్నేహితులం. ఎప్పుడు మే మిద్దరం హోటలుకు వెళ్ళినా, నేనే బిల్లు యిస్తాను. పేకలో యిద్దరం ఎప్పుడూ ఒకేపార్టీలో ఉంటాము. అదిగాక ఆయనకు యే ఘుడియన అప్పు కావాలన్నా నా దగ్గరకే వస్తాడు. ఇంకా ఆయన 15 రూపాయలు బాకీ నాకు! ఇవ్వాళ వాళ్ళ అమ్మాయి పెళ్ళికదా అని మా పరిచయమంతా మరిచిపోయి భోజనానికి పిలవకపోతాడా? కల్ల.

అరుగో సూర్యనారాయణగారు ప్రత్యక్షం.

"రండి! రండి! కూర్చోండి" అన్నాను మర్యాదగా.

"ఎక్కడండీ! కూర్చోటానికి తీరుబడి ఉందా! మా యింట్లో యివ్వాళ పెళ్ళి. కొంచెము మామిడి మండలు కావాలె...

"ఓస్! యిదేనా ? మీ యిష్టం వచ్చినన్ని తీసుకు వెళ్లండి. చెట్టు మొత్తం తీసుకెళ్లినా ఫరవాలేదు. వేరే చెట్టు నాటుతాను" అన్నాను.

"మా వాడిని పంపిస్తానులెండి" అని చరచరా వెళ్ళిపోయినాడు.

"భోజనానికి పిలవటానికి వచ్చినాడా?" అని వంటింట్లోనుంచి సూటి ప్రశ్న.

"ఆఁ! ఆయన హడావుడి మీద ఉన్నాడులే! పాపం ఒక్కడైనాడు. అన్ని పనులూ ఆయనే చూసుకోవాలె కాబోలు."

"మీ పిచ్చి చాలు కాని బియ్యం తీసుకు రండి! పిలవతలచుకుంటే పెండ్లిపత్రికే ఇచ్చేవాడు."

"నిజమే! కాని ఒకటున్నది. ఎదురింట్లో ఉండేవాళ్లకు కూడ పత్రిక లెందుకే! మనిషే వచ్చి చెప్పిపోదాం అనుకున్నాడు కాబోలు."

మళ్లా సూర్యనారాయణగారు ప్రత్యక్షం.

"చెప్పటం మరిచిపోయినాను..."

"చాలపనిమీద ఉన్నారు. అవును లెండి. అర్థం అయింది."

"ఆఁ! ఏమీ లేదు. రాత్రికి పెట్రోమాక్సు లైట్లు కావాలె. అవి యెక్కడ అద్దెకు యిస్తారో తెలీదు. మా వాడికి అసలు తెలీదుట."

"అట్లాగా! నేను ఆఫీసుకు వెళ్లేటప్పుడు కొట్టువాడితో చెప్పుతానులెండి" అన్నాను. మళ్లా ఉడాయింపు.

నిజంగా యీయన భోజనానికి పిలుస్తాడా

## ఆర్. చలపతిరావు

అని అనుమానం వేసింది. కాని, మా మిడికొమ్మలు, పెట్రోమాక్సులైట్లు—కృతజ్ఞత అన్నా చూపకపోతాడా అని ఆశ!

అయినా పోయింది ఏమున్నదీ! పదకొండుగంటలదాకా ఆఫీసుకు వెళ్లక్కర్లేదు. చూద్దాం అని అట్లాగే కూర్చున్నాను. ఎనిమిది గంటలయింది. ఏమీ లేదు. తొమ్మిది పది. పెండ్లివారు కాబోలు వచ్చారు. సూర్యనారాయణగారియిల్లు చాలా చిన్నది. అందుకని పెండ్లికి వచ్చిన వాళ్ళంతా బయటనే తారట్లాడుతున్నారు. మా అరుగు మీదనే తిష్ఠవేశాడు ఒకాయన.

"ఏమండీ! పెండ్లి తరఫువారా ?" అన్నాను, పరిచయం చేసుకుందామని.

"అవునండీ! సూర్యనారాయణగారి వియ్యంకుణ్ణి. మా అబ్బాయికే వాళ్ళమ్మాయిని యిచ్చేది" అన్నాడు.

"అయితే యింకేం ? వియ్యంకుడుగారు యిక్కడ కూర్చోటమేమిటి ? రండి యింట్లోకి వెళదాం" అని లోపలికి తీసుకు వెళ్లాను.

"మా వియ్యంకుడుగారు మీకు బాగా పరిచయమేనా ?" అని అడిగాడు.

"అదేమిటండోయ్! అట్లా అడుగుతున్నారు. మే మిద్దరం స్నేహితులం. ఆయన నాకు అయిదేళ్లనుండి పరిచయం" అన్నాను.

"వాళ్ళకు కాఫీ అలవాటు ఉందా ?"

"అదేమిటి ? అటువంటి అనుమానం వచ్చింది మీకు ?"

"కాఫీ రుచి యెరిగినవారెవరూ అటువంటి బురదనీళ్లు పెళ్లివారికి పంపరు" అన్నాడు కళ్లెర్రజేస్తూ!

"అదేమున్నది లెండి! రకరకాల వారికి రకరకాల కాఫీలు నచ్చవచ్చు. కొంత మందికి స్ట్రాంగ్ కాఫీ కావాలె. పాలు తక్కువ. పంచదార తక్కువ. కొంత మందికి లైట్ కాఫీ అంటే యిష్టం. పాలు యెక్కువ. పంచదార ఎక్కువ. కాఫీ విషయంలో మాత్రం ఒక రూలంటూ లేదు." అయితే మీరు కూడా ఆ బురద నీళ్లే తాగుతారా ? అవునులెండి! ఆయన స్నేహితులంటిరిగా ?"

"ఎబ్బెబ్బే! చాల పొరబాటుపడ్డారు. మీరూ మీరూ యేదో బంధువులు కదా అని అన్నాను కాని, ఆయన్ను నేను సమర్థించటంలేదు. మీ కింకా అన్ని



# ఎదురింట్లో పెండ్లి



విషయాలూ తెలీవు. ఇంత స్నేహితుడిని కదా, నన్ను యీ పెళ్ళికి భోజనానికి కూడ పిలవలేదు ఆయన" అని ఒక బాణం విసిరాను.

"అఁ!" అన్నాడు ఆయన ఆశ్చర్య పోతూ.

"పై పెచ్చు, మా యింట్లో మామిడి చెట్టంతా ధ్వంసం చేశాడు, మండలు కావాలని. ఇంకా పైన ఆయనకు పెట్రొమాక్సు లైట్లు నేను సప్లై చెయ్యాలట."

"ఛా! ఛా! ఆయన్ను స్నేహితుడని పిలవటం నాకు చాలా సిగ్గుగా ఉన్నది."

"నాకూ చాల సిగ్గుగానే ఉన్నది."

"ఉత్త వెధవన్నమాట."

"అంట్ల వెధవ!" అని నేను సవరించాను.

"ఛా!"

"ఛీ!"

ఆయన హఠాత్తుగా లేచాడు. "ఉండండి! ఈ విషయం యేదో తేల్చుకువస్తాను."

"అఁ! అఁ! వద్దు. వద్దు. ఈయన భోజనం వల్లనే మా కడుపులు నిండుతున్నయ్యా రోజూ! ఏదో మనిషి తత్వం యిదీ అని చెప్పానుగాని యిప్పుడు, ఆయన నను భోజనానికి పిలుస్తే యెంత? పిలవకపోతే యెంత?" అన్నాను.

"కాదు లెండి మీకు తెలీదు" అంటూ పెండ్లివారింట్లోకి పరిగెత్తాడు.

సరే! మనల్ని భోజనానికి పిలవలేదు అన్న సంగతి సూర్యనారాయణగారికి యెరిగించాము. కాని యీ విషయం సవ్యంగా గడిచిపోతుందా? ఈ వియ్యంకుడు చూస్తే ముక్కోపిగా ఉన్నాడు. ఏం గొడవ చేస్తాడో అక్కడకు వెళ్ళి! ఎట్లాగూ పోట్లాట తప్పదు. అయినా యీయన పెట్టే భోజనానికి యింత గందరగోళం చేయటం బాగుంటుందా? అసలే వియ్యంకులకు పచ్చిగడ్డి వేస్తే భగ్గుమంటున్నది. ఈ విషయంమీద యెంతకైనా పోతుంది వ్యవహారం! చివరకు నేను పెళ్లి చెడగొట్టినవాడిని అవుతానేమో అని భయం పుట్టింది. అయినా యీ వ్యవహారం మన చెయ్యి దాటింది. అదుగో అప్పుడే కేకలు వినిపిస్తున్నయి. "వెధవ", "కుక్కవేషాలు" "నీచపు బుద్ధి" అనే మాటలు బాగా వినపడుతున్నవి. హోరాహోరి పోట్లాట జరుగుతున్నది.

ఒక్క క్షణంలో సూర్యనారాయణగారి వియ్యంకుడు గబగబా మా యింట్లోకి వచ్చారు. నాకేమీ తోచలేదు. "కొంచెము శాంతించండి" అన్నాను మెల్లగా.

"నేను శాంతించటానికి వచ్చు వెధవను కాను" అన్నాడాయన.

ఒక్క క్షణంలో సూర్యనారాయణగారు కూడ ప్రత్యక్షం. ఆయన వెనకనే పెళ్ళివారు బిక్కమొఖాలతో. "బావగారూ! ఇంత చిన్న విషయంమీద మీకు ఈవిధంగా కోపం వస్తుందని అనుకోలేదు" అన్నాడు జాలిగా నావైపు చూస్తూ. నేను జాలిగా వియ్యంకుడివంక చూశాను.

"ఇది చిన్న విషయమా? నీబోటివాళ్లకు యిది చిన్న విషయం కావచ్చు. ఇంత నీచపు బుద్ధివాడివని నాకు తెలీదు. నేను ఖచ్చితంగా చెబుతున్నాను. ఈ పెళ్ళి అక్కర్లేదు" అన్నాడు, నా టేబిల్ గట్టిగా గుద్దుతూ.

ఓహో! అనుకున్నంత పనీ జరిగింది. శ్రుతి మించి రాగానపడ్డది. ఇంత స్వల్ప విషయంమీద—అదీ,—నాకూ, సూర్యనారాయణగారికి సంబంధించిన విషయంమీద,—ఈయన యింత పట్టుపటడం, పెళ్లి ఆపటం నాకు యిష్టం లేదు. ఈ పోట్లాటకు కారణం నేను కాబట్టి, నేనే దీన్ని సరిదిద్దాలి అనుకున్నాను.

"ఏమండీ! ఇంత చిన్నదాన్ని గురించి పెండ్లి ఆపటం నాకేమీ బాగా లేదు" అన్నాను.

"ఇది చిన్నదిటండీ! దగా!! మోసం!!! 1500 రూపాయలు కట్నం యిస్తామని, ఒట్టి పప్పు చూపించి, ప్రామిసరీ నోటు నా జేబులో పెడతాడా?" అన్నాడాయన.

ఓహోయ్! నా విషయం కాదన్నమాట వీళ్లు పోట్లాడుకోవడం! అసలు కట్నందగ్గరే పేచీపడిందన్నమాట!

"రెండురోజుల్లో యిస్తానంటినికదండీ!" అన్నాడు సూర్యనారాయణగారు యేడుపు ముఖం పెడుతూ.

"రెండు రోజులు కాదుకదా రెండు ఘడియలు కూడ వీల్లేదు. అసలీ పెళ్లే వద్దు. మీ యింట్లో భోజనం కూడా చెయ్యను. ఏమండీ! మీ యింట్లో యీ పూట వంట చేయించండీ!" అన్నాడు నావైపు తిరిగి.

"భోజనానికేమిలెండి" అని వంటింట్లోకి వెళ్లాను "ఆ పది రూపాయల నోటు యెక్కడ పెట్టావే! బియ్యం తేవాలె" అన్నాను మా ఆవిడతో. ★




## ఉపచారము ★ ఇల్లిందల సరస్వతీదేవి

"ప్రజలకు స్వాతంత్ర్యాలనూ సుఖాలనూ చేకూర్చే రాజకీయాధికారము గొప్పదని నేనూ అంగీకరిస్తాను. కాని దానికంటె, రోగార్తులకు ఉపచరించి పొందే మాతృత్వాధికారము గొప్పది. ప్రపంచములో దుఃఖమూ, బాధ, నశించాలంటే, స్త్రీలు స్వయముగా పూనుకొని మాతృహృదయముతో కృషి చేయాలి" అని ఫ్లారెన్సు నైటింగేలు స్త్రీలోకానికి ఎలుగెత్తి చాటింది.

ఫ్లారెన్సు నైటింగేలు ఇటలీ దేశములోని ఫ్లారెన్సు పట్టణములో గొప్ప ఆంగ్లేయ కుటుంబములో జన్మించి, ఉన్నత విద్య నభ్యసించి, జర్మన్, ఇటాలియన్, ఫ్రెంచి భాషలను నేర్చి, తన జీవితమంతా రోగులకు ఉపచరించుటలోనే గడిపి, ఉపచార వృత్తికి గౌరవ ప్రతిపత్తిని సంపాదించి, ఆ మార్గాన్ని నిష్కంటకముగా చేసిన సంఘసేవిక; రోగుల పాలిటి కన్నతల్లి.

గురువులకూ పెద్దలకూ భక్తిగౌరవాలతో చేసేవి పరిచర్యలూ, రోగార్తులకు బాధోపశమనానికై కారుణ్యముతో చేసేవి ఉపచర్యలూను. పరిచర్యలు చేయుటలో భక్తిగౌరవాలెంత ప్రధానములో, పరితప్త హృదయమూ, కరుణ, ఉపచర్యల కంత ప్రధానమైనవి. అసహ్యమన్నది లేక, బిడ్డలపోషణే ప్రధానాశయముగా పెట్టుకొని, వారిని లాలించి పోషించే మాతృమూర్తివలె, ఉపచారముతో రోగికి బాధోపశమనము గావించి, సానుభూతితో పలుకరించి, రోగి ఆరోగ్యమే తన ప్రధానాశయముగా భావించేది ఉపచారిక (నర్సు). రోగులకు బాధోపశమనము కావించటమూ, బాధ కలుగకుండా చేయటమూ ప్రాణరక్షణతో సమానమైనవి. రోగికి వ్యాధి నయము కావటములో ఉపచారికల బాధ్యత, ఆదినుండీ అంత్యమువరకూ స్వల్పభేదముతో వైద్యుని బాధ్యతతో సరిసమానమైనది.

ప్రతి మానవుడికీ, జీవితములో, ఎప్పుడో ఒకప్పుడు అసహాయస్థితి రాకమానదు. ప్రకృతికి విరుద్ధముగా నడచుకొన్నప్పుడు గాని, ఒకరినుండి ఒకరికి సంక్రమించినవి గాని, ఆనువంశికమైనవి గాని, వ్యాధులు ప్రతి మానవుడికీ అనుభవములోనివే. ప్రతి మానవుడికీ బాల్యము వృద్ధాప్యము అసహాయ దశల క్రింద లెక్కింపతగినవే. ఈ అసహాయ దశలలో చలించని ధైర్యముతో, స్వార్థరహితమైన సేవాభావముతో ఉపచారము చేసేవారు కావలసిఉంటారు. ఉపచారకుల సేవాభావములో దేశ, కుల, మత, భేదాలు ఉండవు. జాతి వివక్షతలు అంతకంటె లేవు. వారి దృష్టి విశ్వమంత వైశాల్యము కలది.

జంతువులకు కూడా మానవులకు వలెనే అసహాయస్థితి కలగటము సహజము. కాని అవి సహజోపాయాలతో వాటికవే ఉపచరించుకొంటాయి. వాటి బాల్యదశ మానవుని బాల్యదశ పోలికలో అతి స్వల్పకాలము. గాయపడిన జంతువు తన కరుకైన నాలుకతో పుండును అద్ది మున్నుకొంటుంది. రక్తము కారుతున్న గాయాలను పారుతున్న నదులలో కడిగివేయటమువల్ల నీటి ఒత్తిడికి రక్తస్రావము తగ్గిపోతుంది. వ్యాధులకు తగిన ఆకులను తిని, వాటికవే చికిత్స చేసుకొంటాయి. ప్రసవించిన తరువాత తీసుకొనవలసిన ఔషధాలు కూడా వాటికి తెలిసినవీ అందుబాటులో ఉన్నవీను. ఈ విధముగానే పక్షులు కూడా వాటికవే ఉపచరించుకొని వైద్యము చేసుకొంటాయి. పక్షులలోనూ జంతువులలోనూ ఎదుటివాటికి వైద్యముచేసి ఉపచరించినవి కూడా ఉన్నాయి.

ఆదికాలమునుండీ బలవంతుడైన పురుషుడు కష్టముల కోర్వజాలినవాడు కనుక, ఆహార సంపాదనార్థమై బయట తిరుగుతూ ఉండేవాడు. స్త్రీ బిడ్డలను సంరక్షింప

 **ఉపచారము** 

వలసినది కనుక గృహములో ఉండి, శిశు సంరక్షణ చేస్తూ, ఇంటిలో ఉన్నవారందరికీ కావలసిన ఆహారాన్ని సిద్ధము చేసేది. ఎవరికి ఏ సమయములో ఏది కావలెనో దానిని సమకూరుస్తూ ఉండేది. ఒక ఇంటిలో ఉన్నవారు, అనారోగ్యము కలిగినప్పుడూ, అసహాయ్యము కలిగినప్పుడూ, వారిలో వారు ఉపచారము చేసుకొనేవారు. అనుభవజ్ఞులు వచ్చి ఔషధము ఇచ్చినా, దానిని రోగిచేత సేవింప చేయుటము, కావలసిన సదుపాయాలను కల్పించటము, బాధోపశమనమయేటట్లు ఉపచారము చేయటము ఇల్లాలి వంతుగా ఉండేది. సాధారణముగా రోగులకు ఉపచారము చేయవలసిన బాధ్యత హృదయ మార్దవము గల స్త్రీగణము వహించేది. ఉపచారముచేయటానికి తగిన ఓర్పూ నేర్పూ స్త్రీలకు సహజముగా పుట్టిన గుణాలని ఆ కాలమునుండీ విశ్వసింపబడ్డది. ఈ సహజగుణసంపత్తితో స్త్రీలు, తమ ఇండ్లలోనేకాక, ఇరుగు పొరుగులకుకూడా సహకరిస్తూ ఉండేవారు. ప్రసవసమయాలలోను, వ్యాధులు వచ్చినప్పుడూ ఆ గ్రామాలలో అనుభవము కలవారు వెళ్లి సహకరిస్తూ ఉండేవారు. కాని-వరదలు వచ్చినప్పుడు, భూకంపము కలిగినప్పుడు, గృహదహనము సంభవించినప్పుడు, ప్రజలనేకులకు ఘోరమైన విపత్తు కలిగినప్పుడు, పెద్దఎత్తున ఉపచారము చేయటానికి స్త్రీలకు తగిన సాధనసంపత్తి లేకపోవటముచేత అసాధ్యమయేది. బాధితులు నిస్సహాయులై, దిక్కు లేక అలమటించి ప్రాణాలను విడచేవారు.

ఆదిమనివాసులు చెట్లఆకులతో వైద్యము చేసుకొనేవారు. ఆకాలములోకూడా ఆవిరిపట్టటము స్వేదస్నానము మొదలైన ప్రకృతిచికిత్సలను చేసేవారు. కొనదేరిన రాళ్ళను వేడిచేసి, వాటితో వ్రణాలను, గర్భములో జనించిన కణతులను, కంటిపొరలను కోస్తూ ఉండేవారు. మంత్రసానితనము మాత్రము స్త్రీలే అనుభవముతో చేసేవారు.

ఆఫ్రికాదేశములోని ప్రాచీనులు కూడా వారి చుట్టుప్రక్కల ఉన్న వస్తువులతో ఔషధములను తయారుచేసుకొని, పంచభూతాల సహాయముతో వైద్యము చేసుకొంటూ, వారిలో ధైర్యస్థైర్యములు కలవారిని ఉపచారము నిమిత్తము నియమించేవారు. ఇక 'ప్రాణము దక్కదు' అని తోచినప్పుడు వైద్యము ఆపుచేసి దైవప్రార్థన చేసేవారు. రోగగుణములను జాగ్రత్తగా గమనించి, తమ స్వబుద్ధితో అనుభవముకొద్దీ, వైద్యమూ ఉపచారమూ చేసుకొనేవారు.

పర్షియా దేశములో రోగులకు ఉపచారము చేయటానికి దాసీలు నియమింపబడేవారు. ఈజిప్టు దేశములో ఆప్తులే రోగికి ఉపచారాలను చేస్తూఉండేవారు.

భారతదేశములో యాత్రికుల చికిత్సలకై కొన్ని పట్టణాలలో, వైద్యాలయాలు ఏర్పడ్డాయి. నిపుణులైన శస్త్ర చికిత్సకులు వైద్యము చేసేవారు. క్రీస్తుకు పూర్వము, 5వ శతాబ్దములోనే సింహళములో అన్ని విషయములలో వైద్యాలయమనతగినదానిని ఒక రాజు నిర్మించాడు. అశోక చక్రవర్తి ఉత్తర హిందూస్థానములో 18 వైద్యాలయాలను నిర్మించాడు. ఆ కాలములో రోగులకు ఉపచారము చేయటానికి వృద్ధులైన స్త్రీ పురుషులు నియమింపబడేవారు.

ఆకాలములో కూడా చురుకుదనము, ఉపకారబుద్ధి, మానసికముగా దైహికముగా శుచీ శుభ్రత కలవారికి, రోగులకు స్నానము చేయించటము, మర్దన చేయుటము గాయములకు కట్లుకట్టటము మొదలైన పనులలో శిక్షణనిస్తూ ఉండేవారు. భారతదేశములో ఆయుర్వేద శాస్త్రజ్ఞులు కూడా ఔషధసేవతోపాటు రోగులకు శస్త్రచికిత్సలను కూడా చేస్తూఉండేవారు. వారు కూడా రోగులకు ఉపచారము చేసేవారికి శిక్షణ నివ్వటము అవసరమని గుర్తించారు. భారతదేశములో ఆయుర్వేదశాస్త్రము 500 నుండి 250 క్రీ. పూ. వరకూ ఉన్నతదశలో ఉండేది. ఆ కాలములో ఉచ్చదశలో ఉన్న వైద్యాలయాలు, శిక్షణ పొందిన ఉపచారకులూ వుండేవారు.

పాశ్చాత్య దేశాలలో క్రైస్తవ దేవాలయాలకు అనుబంధముగా వైద్యశాలలు ఉండేవి. పాపము చేసినందువల్ల వ్యాధులు కలుగుతాయనునమ్మకముతో వైద్యముతోపాటు బాధోపశమనానికి దైవప్రార్థనలు చేస్తూ ఉండేవారు. రోమను సామ్రాజ్యములో రాజులే క్రైస్తవ దేవాలయాలకు కూడా అధికారులుగా ఉండేవారు. విద్య, పరోపకార చింతా కల స్త్రీలను వైద్యాలయాలలో నియమించేవారు. రోము నగరములో ఉన్నత కుటుంబాలలోని స్త్రీలు వైద్యాలయాలను స్థాపించటము, ఉపచారము చేయటము 6వ శతాబ్దములోనే ప్రారంభమయింది. మార్సెలా అనే వితంతువు, స్త్రీల కొక ప్రత్యేక వైద్య కేంద్రాన్ని స్థాపించింది. కేవలము పేద రోగులకు ఉపచారము చేయటము, వైద్యము చేయించటమూ ఆమె ప్రధానాశయాలుగా పెట్టుకొన్నది. ఆ దేశములో అది స్త్రీలకు ప్రథమ ప్రత్యేక వైద్యశాలగా పరిగణింపబడ్డది. పాశ్చాత్యదేశాలలో వైద్యాలయములవిషయములోను, ఉపచారము విషయములోను స్త్రీలే ఎక్కువగా శ్రద్ధతీసుకొని కృషిచేసినట్లు నర్సింగు చరిత్రవల్ల (*Nursing History*) తెలుస్తున్నది. వారిలో ఫాబియోలా, మార్సెలా, పాల అను ముగ్గురు స్త్రీలు ప్రముఖురాండ్రు.

వారి కాలములో ఉపచారికలకు శాస్త్రీయ శిక్షణనిచ్చే సంస్థలు స్థాపింపబడి గ్రామాలలో కూడా శాఖోపశాఖలు వెలసినవి. ఈవిధముగా పాశ్చాత్య దేశాలలో ఉన్నత కుటుంబాలలోని స్త్రీలు ప్రజాసేవ చేయటము గౌరవముగా భావించేవారు. ప్రజాసేవ భగవత్ప్రీతికరమైనదని క్రీస్తు ప్రచారము చేసిన తరవాత, ఆయన శిష్యులు కూడా ఆవిధముగానే నడచుకోవటము మొదలుపెట్టారు. వీరిలో కూడా స్త్రీలే అధిక సంఖ్యలో ఉండేవారు. క్రమముగా క్రైస్తవ దేవాలయాలకు అనుబంధముగా వైద్యాలయాలు, ఉపచారము చేసేవారికి శిక్షణాలయాలు అధికసంఖ్యలో బయలుదేరాయి. ఫ్లారెన్సు నైటింగేలు ఈవిధమైన శిక్షణబడసి, ఉపచారవృత్తి నవలంబించినదే.

పాశ్చాత్య దేశాలలో, ఉపచారవృత్తిలో శిక్షణను పొందినవారు ఈ శ్రేణికి చెందిన అనేకరంగాలలో ప్రజాసేవ చేస్తున్నారు.

రెడ్ క్రాస్ సొసైటి: ఇది 1864 లో హెన్రీడ్యూనాంటు చేత స్విట్జర్ లాండులో స్థాపింపబడ్డది. ఈ సంఘము యుద్ధకాలమున సైనికులకు సహాకరించటానికి ఏర్పడ్డది. 67 జాతులు' ఇటువంటి సంఘాలను స్థాపించుకొన్నాయి. ఈ సంఘాలు స్థాపింపబడక పూర్వమే ఫ్లారెన్సు నైటింగేలు క్రిమియన్ యుద్ధములో గాయపడిన సైనికులకు, తన అనుచరురాండ్రతో వెళ్లి, ఉపచారము చేసి ప్రభుత్వ మన్ననలను పొందింది. గాయపడిన సైనికులకు ఉపచారము చేస్తూ, నిశివేళ, దీపము చేతపట్టుకొని ప్రతి పడకవద్దా ఆగి, పరిశీలించే ఫ్లారెన్సు నైటింగేలును 'ది లేడీ ఆఫ్ ది లాంపు' (*The Lady of the Lamp*) అని పిలిచేవారు. సుప్రసిద్ధ ఆంగ్లకవి లాంగ్ ఫెలో ఈమెను గురించి కవిత్వము వ్రాశాడు.

ఉన్మాద రోగులకు ఉపచారము: దేహానికి అనారోగ్యమూ వ్యాధులూ వచ్చినట్లే మనస్సుకు కూడా సంభవిస్తూ ఉంటాయి. ఈ వ్యాధులకు కూడా ఔషధసేవ కావలసి ఉంటుంది. వీటిలో కొన్ని వ్యాధులు దీర్ఘముగా ఉంటాయి. దేహానికి ఏ వ్యాధి వచ్చినా, ఇంటిలో వైద్యమూ ఉపచారమూ జరగటము సాధ్యము; కాని మానసికమైన వ్యాధులకు అసాధ్యము. రోగి మనస్సు స్థిమితము తప్పి, ఉన్మాదావేశముతో నిండిఉంటుంది. కనుక ఈ రోగులను విధిగా వైద్యాలయాలలో చేర్చవలసే వస్తుంది. వైద్యాలయాలలో ఇటువంటి రోగులకు ఉపచారము చేయటానికి నియమింపబడే నర్సులకు ప్రత్యేకమైన శిక్షణ అవసరము. నర్సులకు సామాన్యముగా యిచ్చే శిక్షణతోబాటు ఉన్మాద వైద్యాలయ శిక్షణకూడా ఇవ్వవలసి ఉంటుంది.

ఫ్లారెన్సు నైటింగేలు పని ప్రారంభించక పూర్వమే, స్కాట్లండులో బ్రౌని, ఇంగ్లండులో విలియమ్ ట్యూకి, జర్మనీలో డాక్టరు జెకోబి ఉన్మాద వైద్యాలయాలలో పనిచేయటానికై కొందరు ఉపచారికలకు శిక్షణ నివ్వటానికి ప్రయత్నించారు. కాని అవి అంతగా లాభించలేదు. క్రమ క్రమముగా స్త్రీలు ఉపచారికలుగ శిక్షణపొంది కృతకృత్యులయారు. పూర్వము ఉన్మాదాన్ని అంతగా గమనించేవారు కాదు. కుటుంబములో ఎవరికైనా ఉన్మాదము కలిగినట్లయితే ఆ కుటుంబములోని వారుమాత్రమే బాధపడేవారు. 1946 లో జాతీయ మానసికారోగ్య చట్టము (*The National Mental Health Act*) వచ్చినతరువాత దేశములో ఎవరికి ఉన్మాదముకలిగినా నలుగురికీ పట్టినదయి, వారి మంచిచెడ్డలను సంఘము విచారించవలసినదయినది. ఆ చట్టముయొక్క ఆశయాలు 'రోగులకు మానసికాభివృద్ధిని కలిగించటము, దానికొరకు పరిశోధనలను సాగించటము ఉన్మాదరోగుల కుపచారము చేయుటములో ఎక్కువగా శ్రద్ధతీసుకోవటము' నయముగాని ఉన్మాదరోగులకు కేవలము ఉపచారము చేయటమే ఉపచారికల పని. ఇతరరోగులవలె ఉన్మాదరోగులు చెప్పినట్లువినరు; ఎదురుతిరుగుతూఉంటారు. ఈపనిలో ఉపచారికలకు అంతగా అభిరుచి ఉత్సాహమూ ఉండవు. కొన్ని సమయాలలో ఉపచారికలకుకూడా భావోద్రేకము కలిగే పరిస్థితులు సంభవిస్తూ ఉంటాయి. ఇతరరోగుల కుపచారముచేసే వారికంటె ఈ ఉపచారికలు కొంతవరకు కఠినముగా ఉండవలసి వస్తుంది. ఇండ్లకు వెళ్లి ఉపచారముచేసే నర్సులకు, ఉన్మాద రోగులకు ఉపచారముచేసే నర్సులకు, సాధారణముగా వైద్యాలయాలలోను, ఇతర రంగాలలోను పనిచేసే నర్సులకంటె, క్లిష్ట పరిస్థితులలోకూడా మసలుకొనగలిగిన ప్రత్యేకమైన మెలకువలు లేకపోయినట్లయితే పని చేయలేరు. ఉన్మాద రోగులకు ఉపచారము చేయబూనుకొన్న నర్సులు దేహానికీ మనసుకూ మధ్య ఉండే సంబంధాలను చక్కగా పరిశోధన చేయవలసి ఉంటుంది.

దీర్ఘరోగులకు ఉపచారము. అనేక విధముల కృషి, పరిశోధనలు జరిగిన తరువాత మానవుని ఆయుర్దాయముయొక్క ప్రమాణము పెరిగినది. వ్యాధుల ముమ్మరము తగ్గినా, ఔషధములు బాగా పనిచేస్తున్నా, ఆరోగ్య విధులు ప్రజలలో బాగా ప్రచారము పొందినా, ఆరోగ్య రక్షణకై ప్రభుత్వము తగు చర్యలను తీసుకొంటున్నప్పటికీ, వృద్ధులయొక్క, దీర్ఘవ్యాధి పీడితులయొక్క సంఖ్య సంఘములో అధికముగా ఉండనే ఉంటుంది. దీర్ఘవ్యాధి పీడితుల సంఖ్య అధికముగా ఉండటములో ఆశ్చర్యము లేదు. దానికి కారణము వారిని నిర్లక్ష్యము చేయకుండా జాగ్రత్తగా చూడటము కూడా ఒకటిగా పరిగణింపబడ్డది. కనుక దీర్ఘరోగులకు వృద్ధులకు ఉపచారము చేయటానికి కొందరు ఉపచారికలు అవసరము. కుటుంబాలలో సరియైన జరుగుబాటు లేనివారు ఈ వైద్యాలయాలలో చేరుతూ ఉంటారు. కొందరు దీర్ఘరోగులయినా, కొంతసేపు లేచి కూర్చుని, ఏ చిన్న చిన్న పనులనయినా చేయగల శక్తి ఉంటుంది. ఉపచారికలు ఆ సమయము, అవకాశమూ కనిపెట్టి, చేతనయిన పనులు వారిచేత చేయించినట్లయితే, వారి జీవనోపాధికి కొంత సహాకారము లభించటమే కాకుండ, మనస్సుకు కూడా ఉల్లాసము కలగడానికి అవకాశముంటుంది.

దాయీలు: వైద్యుని పర్యవేక్షణక్రింద గాని, శిక్షణపొందిన నర్సుల చేతిక్రింద గాని, రోగులకు ఇళ్ళవద్దగాని, శరణాలయాలవద్ద గాని ఉపచారము చేసేవారు దాయీలు. ఉపచారికలకు నిర్ణయింపబడిన శిక్షణను పొందకుండా ఉపచార ధర్మము నిర్వర్తించేవారు.

వైద్యాలయాలతో గాని, వైద్యులతో గాని నిమిత్తములేకుండా ఇండ్లకువచ్చి ఉపచారధర్మము నిర్వర్తించే ఉపచారికలు: సాధారణముగా రోగులు వైద్యాలయాలలో చేరి ఉపచారము పొందుతూ ఉంటారు. పేదవారికీ సామాన్యులకూ ప్రభుత్వవైద్యాలయాలలో చేరటమే అనువైనపద్ధతి. మధ్యతరగతికుటుంబాలలోను, పై తరగతులలోను వైద్యాలయాలలో చేరి ఉపచారము పొందటానికి వీలుకానప్పుడు, ఈ ఉపచారికలను ఇండ్లకు పిలిపించుకొని, దినభృత్యములిచ్చి ఉపచారము పొందవచ్చు. వైద్యాలయాలకు వెళ్ళి ఉపచారము పొందలేని పిల్లల తల్లులకు, ఇంట మనిషిసహాయము లేనిపక్షమున, వీరిని నియమించుకొని ఉపచారము పొందవచ్చు. ఈవిధానము కుటుంబినులకు చాలా సదుపాయమైనది. అశిక్షితులైన సేవకుల

(30-వ పేజీ చూడండి)



మహాబలిపుర శిల్పం; ఫొటో: వి. కేశవశర్మ—మద్రాసు.

 ఉపచారము 

చేతగాని, ఇరుగుపొరుగులచేతగాని ఉపచారముపొంది ఇబ్బందులు పడ్డదానికంటె, ఈ ఉపచారికలను నియమించుకోవటము మేలు.

ప్రజారోగ్యమునకై ఉపచారికలు: వీరికి కూడా ప్రత్యేకశిక్షణ అవసరమని గుర్తింపబడ్డది. 1893లో న్యూయార్కు వైద్యాలయములో, పటభద్రఅయిన మేరీ బ్రూస్టరుతోడివారి ప్రోత్సాహముతో, కుగ్రామాలకు వెళ్ళి, పనిచేయ నారంభించింది. బయలుదేరునప్పుడు ఆమె మనస్సులో ఒకపథకముగాని, కార్యక్రమముగాని నిర్ణయముగా లేదు. కాని గ్రామాలకువెళ్లి ఆరోగ్య కేంద్రాలను స్థాపించి పేదల జీవితవికాసానికి పాటుబడి, అందరిచేత మెప్పుపొందింది. ఇతర దేశాలనుండి కూడా ఉపచారికలు వచ్చి, ఈ కేంద్రాలలో అనుభవము సంపాదించుకొని వెళ్లుతూ ఉండేవారు. ఈ కేంద్రాలలో పనిచేసేవారికి రోగుల కుపచారము చేయటమే ముఖ్యమైన బాధ్యత అయినప్పటికీ, ఆరోగ్య విధులను గురించి ప్రజలకు బోధించటము కూడా ప్రధాన విధి క్రిందనే లెక్క. అంటువ్యాధులను గురించి, గ్రామ పారిశుద్ధ్యమును గురించి, ఆరోగ్యవంతులకు కావలసిన ఆహారమును గురించి, వివరముగా ప్రత్యక్ష ప్రమాణాలతో ప్రజలకు బోధించి సలహాలను ఇస్తారు. ప్రభుత్వము ప్రజారోగ్యమునకై తీసుకొనే శ్రద్ధను గురించి, ప్రభుత్వ పథకాలను గురించి, గ్రామస్థులకు తెలుపుతూ ఉంటారు. ఈ విధానములో ఆరోగ్య విధులను గురించి తెలియని గ్రామస్థుడుగాని, అసహాయ స్థితిలో ఉపచారము పొందని గృహముగాని, ప్రభుత్వాశయాలను గురించి పథకాలను గురించి ప్రచారము కావింపబడని గ్రామముగాని ఉండదు.

పారిశ్రామిక సంస్థలలో ఉపచారికలు: కర్మాగారాలలోను, టెలిఫోను కంపెనీలలోను, గోదాములలోను పనిచేసే కార్మికుల క్షేమము నిమిత్తమై నియమింపబడే ఉపచారికలు. గాయపడిన కార్మికులకు, అస్వస్థత కలిగినవారికి, వీరు ప్రథమ చికిత్స చేస్తారు. ప్రమాదకరమైన పరిస్థితులలో వైద్యులను రావించి చికిత్స చేయిస్తారు. కార్మికులకు ఆరోగ్య సూత్రాలను తెలపటము, కార్మికుల ఇండ్లలో అవసరమైనప్పుడు ఉపచారము చేయటము వీరి పని. కార్మికురాండ్రకు ప్రసవసమయాలలోను, వ్యాధులువచ్చినప్పుడు ఉపచారము చేయటమే కాకుండ, కోరిన సలహాలనుకూడా ఇస్తూ ఉంటారు. కొన్ని కర్మాగారాలు కార్మికుల ఆరోగ్యసంరక్షణకై వైద్యులను నియమించుకొనేవి. వైద్యము చేయటమే కాని, వైద్యులు ఉపచారముచేయరు కనుకను, ఉపచారికల వేతనాలు స్వల్పము కనుకను, అనేక కర్మాగారాలు ఉపచారికలనే నియమింప నారంభించాయి. చాలాకాలము వరకు ఈ ఉపచారికలకు ఏవిధమైనశిక్షణా నిర్ణీతము కాలేదు. తరువాత వీరికికూడా కొంత శిక్షణ అవసరమని గుర్తించబడ్డది. అటుతరువాత - కేవలము అనుభవముతోనే కాక శిక్షణకూడా పొందటముచేత, ఉపచారికలు తమ ధర్మాలను విచక్షణతో నిర్వర్తిస్తూ ఉండేవారు.

వైద్యాలయాలలో సంఘసేవ: వైద్యాలయాలలో రోగనిర్ణయము చేసి, ఇవ్వవలసిన మందులను తెలిపేవాడు వైద్యుడు. ఆ మందులనుఇస్తూ శారీరకమైనబాధలను ఉపశమింపచేస్తూ, రోగులకు ఉపచారముచేసేది నర్సు. కాని రోగులబాధలు అంతటితో నివారింపబడవు. ఎటువంటి రోగికయినా ఔషధము వాడగానే వ్యాధి నయము కాదు. రోగి జీవితములో భూతభవిష్యద్వర్తమానముల వాతావరణాన్ని గురించిన విచారణ జరుగనిదే, రోగనివారణ కాదు. వాస్తవముగా వ్యాధి అనువంశికమైనదిగాని, బాల్యదశలోని పరిసర ప్రభావ సంజనితమైనదికాని, యౌవన విశేషమైనదిగాని, మితిమీరిన కాయకష్టమువల్లగాని, ప్రకృతికి విరుద్ధమైన ఆహార విహారాదులవల్లగాని, గృహచ్ఛిద్రాలవల్లగాని, వీటన్నిటి కలయికవల్లగాని కలిగిఉండవచ్చు. కారణము పైకి క్షుద్రమయినదిగా కనబడినా, దాని పర్యవసానము గొప్పది కావటములో సందేహము లేదు. ఈ పరిస్థితులకు గురి అయేవారు సాధారణముగా, క్షయరోగులు, వ్యాధి నెమ్మదించిన తరువాత బలహీనదశలో ఉన్నవారు, దీర్ఘవ్యాధులు కలవారు, సుఖవ్యాధులు కలవారు, వివాహానికి పూర్వమే మాతలయినవారు, మన స్థిమితము లేక ఆత్మహత్యలకు ప్రయత్నించేవారు, అంగవైకల్యము కలవారు అని మనము గ్రహించుకోవచ్చు. అంగవైకల్యము కలవారికి కృత్రిమావయవములను అమర్చటానికి, నేత్ర రోగులకు కంటి అద్దములు కొనటానికి, దీర్ఘవ్యాధులతో పీడింపబడేవారి జీవనోపాధికి, ఇతర రోగులకు వారి వారి పరిస్థితులకు తగిన విధముగా ధనసహాయము కావాలి. లేక వస్తురూపముగానైనా సరే - సహాయము ప్రధానమయినది. వీరిది అస్వస్థతలోని అసహాయత. దీనిని సంఘపరముగా నివారింపవచ్చు. ఈవిధమైన సంఘసేవకు శిక్షణ అవసరమని గుర్తించబడి పాశ్చాత్య దేశాలలో శిక్షణా పాఠ్య విధానము నిర్ణయింపబడ్డాయి. ఉపచారిక రోగికి ఉపచారము చేస్తూ తనమీద ఆధారపడేటట్లు చేస్తే, సంఘసేవిక సహకరించి, రోగికి తన సమస్యలను తాను పరిష్కరించుకొనే శక్తినీ, సామర్థ్యాన్నీ కల్పిస్తుంది.

ఇతర దేశములవలె భారతదేశములో ఉపచారవృత్తి శాస్త్రసమ్మతముగా అభివృద్ధి చెందని కారణాలలో అస్పృశ్యత ప్రధానమైనది. దేశములో స్త్రీలకు సాంఘిక ప్రతిపత్తి లేకపోవటము, మహమ్మదీయులకు గోషా ఉండటము, ప్రజలలో జాతి వైషమ్యాలు ఉండటము, విద్యాప్రచారము తక్కువగాఉండటము, భాషాభేదాలు, పేదరికము, అనేక సంవత్సరాల జాతి దాస్యము, రాజకీయసంచలనముచేత భారతదేశము ఈవిషయములో కావలసినంతగా పురోగమించలేకపోయినది.

భారతదేశములో రోగులకు వైద్యోపచారాలుచేసేవారిలో మిషనరీ వైద్యులు, నర్సులు అధికసంఖ్యాకులు. 19 శతాబ్దపు చివరిభాగములో ఇంగ్లండు ఆస్ట్రేలియా ఫ్రాన్సు మొదలైన ఇతరదేశాలనుండి కాథలిక్కు సిస్టర్సు, అమెరికానుండి మిషనరీ నర్సులు భారతదేశానికి వచ్చారు. 1885లో ప్రభుత్వవైద్యాలయాలలో స్త్రీలకు వైద్యవృత్తిలోను, ఉపచారవృత్తిలోను శిక్షణ ఇవ్వటానికి పూనుకొని ప్రారంభించారు. స్త్రీ రోగులనుచూడటానికి పురుషులకు వీలు లేదు కనుక, భారతీయవనితలు శిక్షణపొందే

తరచు విదేశీయులే పనిచేశారు. ప్రభుత్వ పరముగా వైద్యాలయాలు నిర్మింపబడి అవి బ్రిటీషువారిపరిపాలనలో ఉండేవి.

భారతదేశములో ఉపచారికలకు ప్రథమ శిక్షణాలయము 1854 లో మదరాసులోను, తరువాత బొంబాయిలోను స్థాపింపబడ్డాయి. అటుతరువాత మిషనరీ వైద్యాలయాలు నర్సింగు పాఠశాలలు స్థాపించబడినాయి. ప్రభుత్వవైద్యాలయాలు వాటిని క్రమముగా అనుసరించాయి. మిషనరీవైద్యాలయాలలో క్రైస్తవులకుగాని, క్రైస్తవ మతము స్వీకరింపదలచినవారికిగాని శిక్షణ నివ్వటానికి అనుమతించేవారు. ప్రభుత్వ పాఠశాలలు ఈ నియమాలను పాటించలేదు. ఉపచారవృత్తిలో, ఉన్నతపాఠశాల విద్యను ముగించినవారికి శిక్షణ ఇవ్వవచ్చునని నిర్ణయింపబడ్డది. 1945 నాటికి భారతదేశములో 150 నర్సింగు శిక్షణాలయాలు స్థాపింపబడ్డాయి. దేశము స్వాతంత్ర్యమును పొందిన తరువాత ప్రభుత్వమువారిచే ఉత్తరమున ఢిల్లీలోను దక్షిణమున వెల్లూరులోమిషనరీలచేతను రెండు నర్సింగు కాలేజియేటు పాఠశాలలు స్థాపింపబడ్డాయి. వెల్లూరులో 1909 నుండీ నర్సింగు పాఠశాలలు నడుపబడుతున్నాయి. 1918 లో వెల్లూరులో ఒక మహిళా వైద్య కళాశాల స్థాపింపబడ్డది. దానిలో 1945 నుండి పురుషులకు కూడా ప్రవేశ మిస్తున్నారు. ఇది భారతదేశములో ప్రధాన కేంద్రముగా పనిచేస్తున్నది. ఇది అమెరికా సంయుక్త రాష్ట్రాలు, కెనడా, ఇంగ్లండు దేశాలలోని 40 చర్చి సంఘాల సహాయ సంపత్తిగల ప్రజాసంస్థ. దీనికి అనుబంధముగా 1946 లో నర్సింగు కళాశాల స్థాపింపబడ్డది. దీనిలో పట్టభద్రులయిన వారికి బి. యస్‌సి (*B. Sc*) డిగ్రీ యిస్తారు. భారతప్రభుత్వము నర్సులను కొంతమందిని ఉన్నత విద్యకై విదేశాలకు పంపింది.

భారతదేశపు రెడ్‌క్రాసు సంఘము వారికి ఉన్నతి వర్గమువారి సహకారము ఉన్నది. మంత్రసాని శిక్షణతోకూడా మొత్తము 2 సంవత్సరాల కాలము శిక్షణ నిచ్చి హెల్తు విజిటర్లను సిద్ధము చేస్తున్నది. వీరు, పాఠశాల విద్యార్థులకు, కుటుంబాలకు సహాయము చేస్తూఉంటారు. ఈ సంఘము చలన చిత్రాలద్వారా ఆరోగ్య విధులను ప్రజలలో ప్రచారము చేస్తున్నది. హెల్తు ప్రాజెక్టులను స్థాపించింది.

ఇతరదేశాలలోవలెనే భారతదేశములో కూడా యుద్ధానంతరము నర్సింగులో అంతకు పూర్వము ఆచారములోలేనివీ, ఊహించనివీ మార్పులు వచ్చాయి; స్త్రీలు, పురుషులకు, సైనికులకు ఉపచారము చేయటానికి సమ్మతించారు.

రెండవ ప్రపంచ మహాయుద్ధకాలములో ఉపచారికలసంఖ్య అల్పముగా ఉన్నకారణముచేత అధికవిద్యావంతులుకాని బాలబాలికలకు, హిమాలయ పర్వతసమీపములో కాలింపాంగ్‌లో ఒక శిక్షణాలయము స్థాపించారు. వీరికి 10 నెలలకాలము శిక్షణ నిచ్చి ఆగ్జిలరీస్ (*Auxiliaries*) అని పిలచేవారు.

భారతదేశములో శిక్షణపొందిన నర్సుల సంఘము (*The Trained Nurses' Association of India*) 1908 లో స్థాపింపబడింది. ఇది 5000 మంది సభ్యులను చేర్చుకొన్నది. దినికి ఉత్సాహవంతులైన విద్యార్థి నర్సులశాఖ అనుబంధముగా ఉన్నది. భారతదేశమందంతటా ఉపచారికలకు సమాన స్థాయిని నిర్ణయించటానికి కృషి సలుపుతున్నది.

మిషనువైద్యాలయాలలో మగనర్సులకు శిక్షణఇచ్చే ఆచారము ఉన్నది. కాని ప్రభుత్వవైద్యాలయాలలో ఈ విధానము లేదు. 1937 నుండీ మగనర్సుల శిక్షణకై పాఠశాలలు ఏర్పడ్డాయి. యుద్ధకాలములో వారి అవసరము కలిగింది. వారిని ఉద్యోగులుగా నియమించటము కూడా జరిగింది. మనదేశములో ఈ శాఖలో దాదాపు 1000 పట్టభద్రులు, 400 మంది విద్యార్థులు పురుషులలో ఉన్నారు.

నేటి స్త్రీలుముందు, భారతదేశములో ఇప్పుడిప్పుడే ఉపచార వృత్తిమీద అభిమానము మొలకలెత్తుతున్నది. మధ్యకాలములో ఉపచారికను (నర్సు) పరిచారికగా (సేవకురాలిగా) భావించేవారు. ఉపచార వృత్తిని నీచముగా చూసేవారు.

పాశ్చాత్యదేశాలలోని ఉపచారికల చరిత్ర గమనించి చూస్తే, భారతదేశములో ప్రతి స్త్రీకి ఆ శిక్షణ నివ్వటము అవసరమనిపించక మానదు. ఉపచారికా శిక్షణ వైద్యాలయాలలో చేరి ఉద్యోగాలు చేయదలచనివారు కూడా పొందవచ్చు. తన కుటుంబానికీ సంఘానికీ సేవ చేయవచ్చు. అవసరమనిపించినప్పుడు వృత్తిగా మార్చుకొనవచ్చు. ప్రథమ పంచవర్ష ప్రణాళికలో నర్సులకు దాయీలకు శిక్షణనిచ్చి శిక్షణ కేంద్రాలలోను ప్రసవ కేంద్రాలలోను వారిని నియమించవలెనన్న నిర్ణయము జరిగింది. శిక్షణ కేంద్రాలనుకూడా అధిక సంఖ్యలో ఏర్పాటుచేశారు. ఈ అవకాశాలను స్త్రీ జనము ఉపయోగించుకొని, నవ చైతన్యముతో కుటుంబాలను, సంఘాన్ని, ఉద్ధరించి, తమ జీవితాలను సార్థకము చేసుకొనవలసినదని స్వతంత్ర భారతము ఆశిస్తున్నది. ★

# స హ వి ద్య

డి. వెంకటరావు

విద్య అంటే జీవితపరిస్థితుల కనుగుణంగా జీవితపంథా ననుసరించటంలో శిక్షణ గరపడం. ఇది పురుషులకే అవసరం- అన్న అభిప్రాయం పూర్వం అన్ని సమాజాల్లోనూ గాఢంగా నాటుకుపోయింది. అంచేత విద్యాభ్యాసం పురుషులకే గరపుతూండేవారు. ప్రాచీన రాజ్యం 'స్పార్టా' (Sparta)లో మాత్రం స్త్రీలకి అధిక ప్రాముఖ్యం ఉండేదని ప్రాచీన గ్రంథాలవల్ల తెలుస్తోంది. స్త్రీల భౌతిక వాతావరణం గృహప్రాంగణాల్లోనే పరిమితం కావటంవల్ల, గృహకృత్య నిర్వహణకి అవసరమైన శిక్షణ తల్లులే ఇస్తూండేవారు. అరుదుగా కొన్ని కుటుంబాల్లో మాత్రం గృహాల్లోనే స్త్రీలకి గ్రంథపఠనం నేర్పటం మనకి చరిత్రలో కనిపిస్తుంది. మన చరిత్రలో గాయత్రీ, మొల్ల, జిజియాబాయిల వంటి సతీమణుల చరిత్రలు ప్రకాశమానంగా వెలుగుతున్నాయి.

ఇరవయ్యో శతాబ్దంవరకూ స్త్రీ విద్య దైన్యస్థితిలో ఉండేది. శతాబ్దాల తరబడిగా వ్యాకరణ పాఠశాలల్లోనూ, (Grammar Schools) విశ్వవిద్యాలయాల్లోనూ పురుషులకే ప్రవేశం ఉండేది.* ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయంలో స్త్రీలకి పరిపూర్ణ సభ్యత్వం 1920 సం॥ వరకూ లభ్యం కాలేదు. కేంబ్రిడ్జిలో 1947 లో లభించింది.* తూర్పు దేశాల్లో స్త్రీలపై నిషేధాలు ఇంకా నిశితంగా ఉండేవి. శాస్త్రాల్లో ఏం చెప్పబడి ఉన్నా - గృహకృత్య నిర్వహణ ద్వారా కుటుంబసేవ చెయ్యటం, పురుషుల విషయంలో వినయ విధేయతలతో ప్రవర్తించటం-అది నిర్ణీత విధానం (Deliberate policy) ద్వారా కానివ్వండి, సహజ పరిణామం (Natural evolution) వల్ల కానివ్వండి - ఆచారం అయింది. స్త్రీలకి పాతివ్రత్యం నిర్దేశించబడింది; కాని పురుషులకి స్త్రీలపై అధికారం ఇవ్వబడింది. మధ్యయుగంలో ఈ పరిస్థితులపై విప్లవజ్వాలల్ని కొందరు సాహసులైన సంస్కర్తలు లేవదీసినా, మతాచారాల్ని వ్యతిరేకించటం మహాపరాధంగా పరిగణించటంవల్ల, ఈ విప్లవోద్యమనాయకులవెలుగు సాంఘిక మతాచారాల ఉక్కుశాసనానికి తట్టుకోలేకపోయింది. వీరేశలింగంపంతులుగారు తమ సంస్కరణ మొదటిరోజుల్లో అనుభవించిన కష్టాలు ఆంధ్రపాఠకులకి బాగా తెలిసినవే. సమానత్వం, సోదరత్వం, బంధుత్వం గట్టిగా ప్రచారంలోనికి వస్తూన్న ఆధునికయుగంలో స్త్రీ ఉద్యమనాయకుల ప్రయత్నాలకి ఇంత నిరోధం కలిగినప్పుడు- సాంఘిక కట్టుబాట్లని విధేయతగా అనుసరించటం, గౌరవలక్షణంగా పరిగణింపబడే మధ్యయుగంలో ఈ నాయకుల యత్నాలు ఫలించకపోవటంలో ఆశ్చర్యం ఏముంది? స్త్రీ విద్య ఇంత దైన్యస్థితిలో ఉన్న కాలంలో సహవిద్య అనేది ఆలోచించటానికైనా వీలుగానివిషయం.

పశ్చిమప్రపంచంలో 19వ శతాబ్దంలోనూ, ప్రాక్ప్రపంచంలో 20వ శతాబ్దంలోనూ, విప్లవాత్మకమైన మార్పులువచ్చాయి. స్వాతంత్ర్య, సమానత్వవాయువుల్ని స్త్రీలు పీల్చడానికవకాశం లభించింది. ఇప్పుడు కూడా ఫ్రాన్సు, ఈజిప్టు దేశాల్లో స్త్రీలకి వోటింగుహక్కు లేకపోయినా, బ్రిటనులో స్త్రీలు ప్రభువులసభలో (House of Lords) సభ్యత్వానికి అర్హులు కాకపోయినా, స్త్రీల విద్యావసరాన్ని అన్ని నాగరిక దేశాల్లోనూ గుర్తించారు. దానికి తగిన ప్రాముఖ్యతనిచ్చారు.

ఇంక స్త్రీలకి పురుషులతోబాటు సహవిద్యని గరపటమా లేక ప్రత్యేకపాఠశాలల్లో విద్యాబోధ చెయ్యటమా అన్న ప్రశ్న సహజంగా ఉద్భవించింది. ప్రాథమిక భేదాలు (Basic Differences) స్త్రీ పురుషుల మనస్తత్వంలోనూ, శారీరకశక్తుల్లోనూ, అభిరుచుల్లోనూ దృగ్గోచరం అవుతూండటంవల్ల పురుషులకి సరిపడే విద్య స్త్రీలకు ఎంతవరకూ అవసరం? లేక అన్ని విషయాల్లోనూ, స్త్రీవిద్య పురుషులవిద్యకి భిన్నంగా ఉండాలా అన్న ప్రశ్న ఉదయించింది. దీనికి సరియైన సమాధానం లభించినప్పుడు సహవిద్యా, ప్రత్యేకవిద్యా అన్న ప్రశ్నకి సమాధానాన్ని చెప్పగలం.

ఈ విషయాన్ని చర్చించేముందు 'సహవిద్య' అనే పదానికి అర్థాన్ని బాగా తెలుసుకోవటం అవసరం. ఒకే పాఠశాలలలో, ఒకే ప్రణాళిక ననుసరిస్తూ విద్య నేర్పటం సహవిద్యగా మనదేశంలో సామాన్యులచేతనే గాకుండా, విద్యావేత్తలచే గూడా పరిగణింపబడుతోంది. ఈ అభిప్రాయం సరిగాదని కొంత ఆలోచనవల్ల తేలుతుంది. ప్రస్తుతం 'సహజీవనం' (Co-existence) అన్న సిద్ధాంతం పండిత, పామరుల ఆలోచనలమీద అమితమైన ప్రభావాన్ని కలిగివుంది. ఈ సిద్ధాంతానికి అర్థం, కేవలం వారూ, వీరూ తగవులు లేకుండా, ఎవరి ప్రాంతాల్లో వారు యుద్ధ ప్రాణభయాలు లేకుండా నివసించటం మాత్రమేనని ఎవరంటారు? దాని అసలు స్వరూపం- తగవులు పోట్లాటలూ లేకుండా నివసించడమే కాదు; పరస్పరం సహకరిస్తూ, సాముదాయిక జీవనంలో ప్రేమ, మైత్రి భావాలతో మెలగుతూ, ప్రత్యేక జీవిత పద్ధతుల్లోంచి ఒక నూతన మహత్తర సాముదాయిక జీవనాన్ని నిర్మించి, తదనుగుణంగా అన్ని దేశాల ప్రజలూ ప్రవర్తించి, భేదభావాల్ని నిర్మూలించి, అంతర్జాతీయ సాముదాయిక సంస్కృతీ రీతుల్ని (Common Universal cultural patterus) నిర్మించుకుని దానిలో భాగస్వామ్యాన్ని అనుభవిస్తూ, ఆ సంస్కృతీ హద్దుల్ని పెంచటంకోసం నిరంతరం సోదరభావంతో కృషిచేస్తున్నప్పుడే సహజీవనం యథార్థ స్వరూపాన్ని దాలుస్తుంది. అదే విధంగా 'సహవిద్య' అంటే - తరగతి గదుల్లో బాలురు ఒక వరసలోనూ, బాలికలు మరోవరసలోనూ కూర్చుంటూ పరస్పరం సంబంధం లేకుండా వీరి ప్రత్యేకజీవనాన్ని వీరూ, వారిప్రత్యేక జీవనాన్ని వారూ గడపడం - అని అర్థం చెప్పటం - సహవిద్యకి వికృతార్థాన్ని కల్పించటం అవుతుంది.

పశ్చిమదేశాల్లో సహవిద్యకు ఈ అన్వయం కనిపించదు. బాలబాలికలు, ప్రాథమిక దశనుండి విశ్వవిద్యాలయ దశవరకూ, ఒకే కుటుంబపు సభ్యులలాగ మెలగుతూ, వినోద, విజ్ఞాన, విశ్రాంతి, వికాస కార్యక్రమాల్లో సహచరుల్లాగ, ఆత్మీయుల్లాగ- పాల్గొంటున్నారు. దీనితోబాటు స్త్రీల అభిరుచులు గుర్తించబడి, నాట్య, గాన, గృహ నిర్వహణాది రంగాల్లో తమ పాత్ర

* ఈ గుర్తుల్లోని విషయాలకి ఆధారం: "Oxford Junior Encyclopaedia. Oxford University press"

# ఈ ఆశ్చర్యకరమైన రాత్రి పగలు
## చర్మ రక్షణ సాధనతో
# మీ చర్మమును సొగసుగ మరియు
# మనోహరముగ ఉంచుకోండి

విశేషమైన పాండ్స్ కోల్డ్ క్రీమ్ మరియు మంచువలెనున్న పాండ్స్ వేనిషింగ్ క్రీములు మీ చర్మమునకు రక్షణనిచ్చి దానిని మృదువుగ, అందముగ ఉంచును.



**చర్మమును మృదువుగ, నిర్మలముగ చేయుటకు రాత్రి వాడే క్రీము**

మీరు పండుకొనేముందు విశేషమైన పాండ్స్ కోల్డ్ క్రీమ్ వాడండి. అది కొన్ని సెకండ్లలోనే మీ చర్మమునకు కావలసిన సహజమైన నూనెలు మరియు క్రీమ్ లోపములను పూర్తి చేసి యథాస్థితికి తెచ్చుటయే కాక దానిని లేతగా మరియు మనోహరముగా ఉంచుటలో సహకరించును.

పాండ్స్ కోల్డ్ క్రీమ్ అద్భుతముగ చర్మమును శుభ్రపరచును. రోమ రంధ్రములు పెద్దవి కాకుండా రక్షణనిచ్చి మీ చర్మమును ఎప్పుడూ నిర్మలముగను నిష్కళంకముగ ఉంచును.








**చర్మమును కాపాడుటకు మరియు సుందరముగ చేయుటకు పగలు వాడే క్రీము**

తేలికగ మరియు మంచువలెనున్న పాండ్స్ వేనిషింగ్ క్రీమ్ పైపైన ముఖమునకు రాసుకుంటే పగటివేళ మీ అందమును అధికము చేస్తుంది. మనోహరము, నిష్కళంకమైన చర్మమును పొందుచేయు దమ్ము. సూర్యరశ్మి మరియు వడగాడ్పుల నుండి ఇది మీ చర్మమునకు సౌమ్యరక్షణ నిచ్చును.

మరియు పాండ్స్ వేనిషింగ్ క్రీమ్ మరి జిడ్డుగా ఉండే చర్మమునకు ఒక అద్భుతమైన సాధనము—దీనితో రోమ రంధ్రములకు అధిక కోశకము కలిగించే అధికమైన నూనెలు లేకుండా చేయవచ్చును.

**పాండ్స్**
**కోల్డ్ క్రీమ్**
**వేనిషింగ్ క్రీమ్**

ప్రపంచలో అందమైన స్త్రీలు వారి సౌందర్య రక్షణకు ఈ రెండు క్రీములనే వాడుతున్నారు. మీరూ వారివలె పాండ్స్ కోల్డ్ క్రీమ్ రాత్రి మరియు పాండ్స్ వేనిషింగ్ క్రీమ్ పగలు వాడండి. త్వరలోనే వికసించిన పుష్పమువలెనున్న మీ ముఖమును చూచుకొని మీరు ఆనందిస్తారు.

లని నిర్వర్తించటంలో కృతకృత్యులవుతున్నారు. ఈ సందర్భంలో మనం సర్వసాధారణంగా వినే 'సెక్సు నైతిక పతనాన్ని' గురించి ఆలోచించటం అవసరం. పశ్చిమదేశాల్లో విశృంఖలజీవనం (*Promiscuous Sex Life*) ఉంటుందనీ, పాతివ్రత్యం చాలా తక్కువనీ, మనం తరుచూ వింటాం. ఈ నింద సత్యమైతే పై జెప్పిన సహవిద్య గర్హ్యమే. పశ్చిమ సభ్యతని నిందించటమే ముఖ్యోద్దేశముగా గల కొన్ని గ్రంథాలవల్లనూ, పాశ్చాత్య దేశాల్లో పర్యటించిన మన భారతీయుల వికృతానుభవాలవల్లనూ - ఈ అభిప్రాయం ప్రచారంలోకి వచ్చింది. పశ్చిమ దేశాల్లో అందరూ, లేక అధిక సంఖ్యాకులు విశృంఖల జీవితాన్ని అనుసరిస్తూఉంటే, ఆ సభ్యత ఏనాడో అధోగతిపాలైపోయి, ఏ విషయం లోనూ ఇతరులకి మార్గదర్శకంగా ఉండకుండా ఎప్పుడో నాశనమై ఉండేది. స్త్రీ పురుష కాముక సంబంధమైన నైతిక జీవితం అధమంగానున్న జాతి అన్ని విషయాల్లోనూ మృగ్యంగా ఉంటుందన్న సంగతి అందరూ అంగీకరించిందే. పశ్చిమ దేశాల నుంచి దేశభక్తి, సాంఘిక సేవ, స్వాతంత్ర్య వాంఛ, ఆర్థిక సాంఘిక పురోభివృద్ధి, క్రమశిక్షణ, విజ్ఞాన వినోద విషయాల్లో మనం అనుకరిస్తున్నవీ అనుకరించవలసినవీ చాలా వున్నాయని మన నాయకులు పదే పదే నొక్కి చెబుతూనే ఉన్నారు. అమెరికా ఫ్రాన్సు దేశాలే పశ్చిమసభ్యతకి ప్రాతినిధ్యం వహిస్తున్నా యనుకోవడం పొరపాటు. అమెరికాలో కూడా ఒక సంవత్సరంలో వివాహితులయిన వారిలో మూడవ వంతు విడాకులు కోరతారని మనం వింటాం. కాని మూడింట రెండువంతులు, అంటే అధిక సంఖ్యాకులు విడాకులు కోరరన్న సత్యం గుర్తించం. పాతివ్రత్యం, పతీత్వం మన దేశంయొక్క మొనాపలీ గాదని చెప్పడం మాత్రమే ఈ వ్యాసకర్త ఉద్దేశ్యం. సభ్యతగల అన్ని దేశాల్లోనూ సతీత్వానికి సంఘంలో ఉన్నత స్థానాన్ని ఇస్తూనే ఉన్నారు. అదివరలో భర్తకు విడాకు లిచ్చిన సింప్సన్ సతిని తమ రాణీగా బ్రిటిష్ ప్రజలు అంగీకరించడానికి ఇష్టపడలేదు. విడాకుల కోర్టులచుట్టూ తిరిగేవారికి ఏ దేశంలోనూ (అమెరికాలో కూడా) సంఘంలో గౌరవం లేదు.

సమాజంలో స్త్రీ పురుషులు సహజీవనానికి దోహద మివ్వాలంటే, 'సహవిద్య' అమలుజరగాలి. సుశిక్షితులై, కర్తవ్యతా ప్రబోధితులైన ఉపాధ్యాయుల పర్యవేక్షణలో సహవిద్య ద్వారా సహజీవన లక్ష్యాన్ని సాధించవచ్చు.

*ఉత్తర ఐర్లాండులోనూ, స్కాట్లండులోనూ, ఉత్తర ఇంగ్లాండులోనూ సహవిద్య ఎక్కువగా ఉంది. బోర్డింగుస్కూళ్లు మాత్రం ప్రత్యేక సంస్థలు. విశ్వవిద్యాలయాల్లో సహవిద్యనే అనుసరించారు అమెరికాలో స్కూలు జనాభాలో 97% సహవిద్యా సంస్థల్లోనే చదువుతున్నారు. రష్యాలో సెకండరీదశలో సహవిద్యని కమ్యూనిస్టు ప్రభుత్వం స్టాలిన్ కాలంలో నిషేధించారు; ప్రాథమిక యూనివర్సిటీ దశల్లో మాత్రం అనుసరిస్తున్నారు. జపానులో 91% పైగా సహవిద్యాసంస్థలు.

మనదేశంలో సహవిద్యాసంస్థలు అధికమైనవి. కాని స్త్రీల హైస్కూళ్ళు, ట్రైనింగు స్కూళ్ళు, ట్రైనింగు కాలేజీలూ కూడా చాలా వున్నాయి పూనాలో స్త్రీలకి ప్రత్యేకంగా ఒక విశ్వవిద్యాలయం ఉంది. మన సహవిద్యాసంస్థల్లో స్త్రీ పురుషుల మధ్య *Segregation* అమలులో ఉంది.

విద్యార్థిదశలో సహజీవనంవల్ల సమాజంలో స్త్రీ పురుషుల సహజీవనం సాధ్యపడటం గాకుండా, అనేక వ్యక్తిగతసామాజిక ప్రయోజనాలున్నాయి. బాలబాలికల్ని విడదీయటంవల్ల అస్వాభావికమైన కుతూహలం ఏర్పడి అనేక విధములయిన దుష్పరిణామాలు కలుగుతాయి. మనం బాలుర హాస్టలు గదుల్లోనూ, నోట్సుపుస్తకాల్లోనూ చూసే అసభ్యరచనలు చిత్రాలకి ఈ అస్వాభావికమైన కుతూహలమే కారణం. ఈ కుతూహలాన్ని చౌకబారు సెక్సు పుస్తకాలూ, ఫిల్ములూ తృప్తిపరుస్తున్నాయి; మరోవైపు వృద్ధిచేస్తున్నాయి. సహవిద్యవల్ల ఈ కుతూహలం క్రమంగా తగ్గి అనేక మంచి ఫలితాలకి దారితీస్తుంది. స్త్రీల సమక్షంలో పురుషులు తమ తెలివితేటల్నీ, వ్యక్తిత్వాన్నీ, కార్యదక్షతని ప్రదర్శించటాని కుత్సుకతని చూపిస్తారు. సహవిద్యాసంస్థల్లో సమానస్థాయిలో యిద్దరూ మెలగుతారు. స్త్రీని తనతో సమానంగా గౌరవంగా చూసే దృక్పథానికి (ఇది ఇంకా ఉపన్యాసాల్లోనూ, పుస్తకాల్లోనూ మాత్రమే కనిపిస్తోంది) పునాదులు సహవిద్యవల్ల వెయ్యవచ్చు. ప్రత్యేక విద్య అసహజం. మన ఇండ్లలో స్త్రీ పురుషుల సహజీవనం సహజం. ప్రత్యేక విద్యవల్ల విద్యార్థులయొక్క, ఉపాధ్యాయుల యొక్క భావాలు కుంటుపడతాయి. దృక్పథం బాగా సంకుచితం అవుతుంది. స్త్రీ పురుషులకి ఒకరినొకరు బాగా అర్థం చేసుకునే అవకాశం లభించదు. *Self-Centredness* వల్ల దుష్ఫలితాల్ని మనస్తత్వ శాస్త్రవేత్తలు నిరూపించారు.

కనక సమానత్వంతో స్త్రీ పురుషులు సంఘంలో మెలగాలన్నా, స్త్రీ పురుషుల మధ్య మనదేశంలో ప్రస్తుతం కనుపిస్తున్న వైరుధ్యం పూర్తిగా పోవాలన్నా, సహవిద్య ఎంతైనా అవసరం. మన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకి ప్రత్యేకవిద్యయందూ, సహవిద్యయందూ కూడా నమ్మకం ఉన్నట్లు కనిపిస్తోంది. పరస్పర వైరుధ్య విధానాలపట్ల సమాన భక్తి మాని ఈ విషయంలో స్పష్టమైన విధానాన్ని నిర్ణయించుకోవడం అవసరం. ★

* ఈ వివరాలు *Junior oxford Encyclopaedia* నుంచి గ్రహించబడ్డాయి.

## కాలేజీలలో పరిస్థితులు

హైస్కూలు, కాలేజీ చదువులలో సహవిద్య అనేకచిక్కులకు దారితీయుచున్నది. ముఖ్యముగా కళాశాలలలో విద్యార్థినులపరిస్థితి చాలా శోచనీయముగా నున్నది. నిర్భయముగా ప్రశ్నలకు జవాబులు చెప్పుటకుకాని, తమకు కలిగినసందేహములను లెక్చరర్ నడిగి నివృత్తి చేసుకొనుటకుకాని యీనాటి విద్యార్థినులకు అవకాశములేదు. ఎంతబుర్ర వంచుకుని నడిచినను కాలేజీవిద్యార్థినికి విద్యార్థులు పేర్లు పెట్టకమానరు. విద్యార్థినులు కేవలము జీవచ్ఛవములవలె కాలేజీ ఆవరణలో సంచరించుచుండుట చాలా విచారకరము.

సహవిద్యవలన పురుషులు స్త్రీలు ఒకరి యెడల నొకరు ఎట్లు సంచరించవలయునో తెలియుననియు ఒకరిభావముల నొకరు అర్థముచేసికొనుటకు వీలగుననియు కొందరి యభిప్రాయము. కాని యది కేవల మపోహ యని మన కాలేజీలలో అనుభవమునుబట్టి తేలుచున్నది.

విద్యార్థినికి కాలేజీలో తన కళావైపుణ్యముకాని సంగీతముకాని ప్రదర్శించుట కవకాశము అసలు లేనేలేదు. ఇందుకు కేవలము విద్యార్థినులకు విద్యార్థులయెడ గల భయమే కారణము. ప్రస్తుతపరిస్థితులలో సహవిద్య విద్యార్థినుల కెంతమాత్రమును సదుపాయముగ లేదని నా అభిప్రాయము.

ఒక విద్యార్థిని, కాకినాడ. ★




# శాస్త్రిగారి పాండిత్యం

అడివి కనకరాజు

శారదయ్యశాస్త్రిగారు
శాస్త్రాలను చదివారు.
పెద్ద పెద్ద వాదములకు
పెండేరములందారు.

పొరుగూరను పండితులకు
భూరివాదముందంటే,
శాలువాను కప్పుకొనుచు
శాస్త్రిగారు పయనమైరి.

పొరుగూరగపడగానే,
పొలిమేరకు దగ్గరగా,
పిల్లనగ్రోవిని వూదుతు
గొల్లడొకడు కనబడగా
చేరజీరి శాస్త్రిగారు
ఈరీతిగ నడిగారు:
"వాడలోన నెక్కడోయి,
వాదముంట పండితులకు?"
"అయ్యా తమరేమైనా
అంతగొప్ప పండితులా?"
అని గొల్లడు శాస్త్రినడుగ
ఔననె నా విద్వాంసుడు.

"మాఊళ్లో సాటిలేని
మహాపండితులు కలరు.
వారిని గెలవటమంటే
వారధికట్టుటె వార్ధికి."
"చాలుచాలు, నావిద్యకు
సరిపోయినవారు లేరు."
"శాస్త్రిగారు! మీరే యే
శాస్త్రాలను చదివారు?"
"ప్రతిశాస్త్రం ఆసాంతం
పట్టిపట్టి చదివాను."
"అయితే నేనొక్క ప్రశ్న
అడుగుతాను తెలపండి!"

గొల్లవాడు తనచేత్తో
గుప్పెడు ఇసకను చూపుతు,
"అయ్యా ఇదిఎంతయుందు?"
ననగానే శాస్త్రిగారు,
సమాధానమియ్యలేక
ప్రమాదమున పడితిననుచు,
"చేతిలోని యిసుకలెక్క
చెప్ప ఎవరిసాధ్య" మనెను.

విని యీమాటలు గొల్లడు
విరగబడుతు నవ్వాడు:
"శాస్త్రాలను చదివారే,
సమాధానమియ్యలేర?
ఇది గుప్పెడు ఇసకండీ!
ఇప్పుడైన తెలిసికోండి!"

ఈమాటలు విన్న శాస్త్రి
ఇంటిముఖంపట్టి తలచె:
"గొల్లనికే ఓడిపోతి,
గొప్పవారి నెట్లు గెలుతు?"




# తోడేలు - మేకపిల్ల

అంతచక్కని మేకకూన
అదియొకటె ఆమందలోన;
అంత సొగసగు మేకపిల్ల
అదిగాక కలదనుట కల్ల.

పట్టువలె మెత్తనగుమేన
పడి నిలువలేదు ఈగైన;
దాని గన్నంతనెదలోన
దయ గొనును కటికవాడైన.

చెంగునన్ దినము దినమెల్ల
చెంగలించును మేకపిల్ల;
నిముసమేనది లేక తల్లి
నిలువజాలదు చెంగటిల్లి.

ఒకనాడు అది దూరమరిగి,
ఒంటిగా అడవిలో తిరిగి,
దాహమై ఒక్క సెలయేరు
దరిసినది త్రావగా నీరు.

అంతనేతెంచె నొక వృకము;
అతిభీకరము దాని ముఖము;
ఝల్లుమన తన యుల్లమందు
తల్లడిల్లెను మేకకందు.

తోడేలు దాని జూచుచును,
తూస్కారమున నిట్టులనెను:
"ఎవరోయి, డింభకా, నీవు?
ఇచటి కెందుకు వచ్చినావు?

సెలయేటి నీటి నిటులేల
కెలక లొనరింతువో చాల?
ఎవ్వ రనుకొంటివో నన్ను?
ఏమిచేతునొ చూడు నిన్ను!"

పసిమేక తన తోకడించి,
పలికె, నిలువెల్ల కంపించి:
"నేనుంటి నీయేటి దిగువ;
నీవు నిలిచిన దేటికెగువ.

నీవున్న దిశనుండి నీరు
నే నున్న తావునకు పారు;
ఎందుకీ రీతి నిందింతు
వేనెట్లు కెలక లొనరింతు?"

"అది సరే, అటు లుండనిమ్మ,
ఇదివిని సమాధాన మిమ్మ:
ఏడాదిక్రింద నను నీవు
ఎందులకు దూషించినావు?"
"ఆర్నెలల పసివాడ నేను,

అది ఎట్లు సంభవమ్మౌను?
పొరబాటు పడితి వనుకొందు,
తెరువిమ్ము ఇలు జేరుకొందు."

ఈరీతి పలుక పసిమేక,
వృకమనెను, అంత బోనీక:
"నిలునిలుము, నీవుగాకున్న
నిందించి యుండు నీయన్న.

ఈసప్ కథలు: 16

నండూరి రామమోహనరావు

అదిగాక, నీతోడవాదు
లాడు ఓపిక నాకులేదు.
తిట్టితివో లేదో నాకేల?
పట్టి నిను తిందునీవేళ."

తోడనే మరునిమేషమున,
తోడేలు తీవ్రరోషమున,
కడతేర్చి అజ కిశోరమును
కబళించె దాని మాంసమును.



నీతి

సిగ్గువిడిచి బలహీనుల
కెగ్గుచేయు బలవంతులు
సాకులేవో చెప్పితమ్ము
సమర్థించుకొన జూతురు

(పెద్దకథ)

# హారణ్యము

10

హారప్రియుని కొమ్ముబూరాధ్వని విని, పుష్కలావతిలోనివాళ్ళంతా ఆనాడు పెందరాళే లేచేశారు. తప్పిపోయిందనుకున్న హెర్మియా ఎక్కడనుంచో వచ్చిందన్నవార్త వ్యాపించటంతోనే, పుష్కలావతంతా, సూర్యోదయంకావటంతోనే కలకలలాడుతో కనపడే తామరకొలనుకుమల్లే ఎక్కడచూసినా వికసించినముఖాలతో కనపడింది.

హెర్మియా కంటపడటంతోనే హిపోలిటా ఆమెను మహదానందంతో ఎత్తుకు ముద్దాడింది. ఇంక మళ్లీ కళ్లబడదనుకున్న ఆ బాలికను చూడటంతోనే ఆ దాదికి కళ్ళమ్మట నీళ్లు ఆగేయికాదు.

ఎగియూసు ఆనందానికి మేరలేకపోయింది. 'వచ్చావా నాతల్లీ!' అంటూ వచ్చి ఎదురుగా నిలబడి ఉన్న ఆ పిల్లని పదేపదే అడగటం మొదలెట్టేడు. పొంగిపొరలివచ్చే సంతోషంయొక్క ఉధృతం తగ్గేక, 'అమ్మా, ఐతే నువ్వు అడవిలో ఆరోజున చూస్తోండగానే మాయమైపోయావేమిటి? ఏంజరిగింది? ఇన్నాళ్లూ ఎక్కడున్నావు?' అని అడిగేడు.

'గుఱ్ఱంమీదనుంచి పడిపోయాను. కాలికి దెబ్బ తగిలింది...ఔనుగాని, ఇకముందు నువ్వు ఇంకా కొంచెం వేగంగా స్వారి చెయ్యాలోయ్!' అంది హెర్మియా.

'ఇకముందా? ఇకముందు నిన్ను విడిగా స్వారి చెయ్యనిస్తా ననుకుంటున్నావుకామోసు. ఎక్కడకు తీసుకువెళ్లినా ఇంక నిన్ను నా గుఱ్ఱంమీదే కూర్చొ పెట్టుకు తీసుకువెడతాను తెలుసా? మంచిపనిచేశావులే! నిన్ను ఇప్పుడు మేము కనుక్కోలేకపోతే మీ నాయనకేమిటి చెప్పడం?' అన్నాడు.

"'మేము కనుక్కోలేకపోతే' అని అంటున్నావు; మహా నువ్వు నన్ను వెతికి తీసుకొచ్చినట్లు! నాఅంత నేనేగా వచ్చింది?" అంది హెర్మియా నవ్వుతో.

'అది సరేగాని ఇన్నాళ్ళనుంచి ఎక్కడున్నావు?'

'దేవతలుండేచోట!' అంది హెర్మియా.

'నీ వేళాకోళం కట్టిపెట్టి సరిగ్గాచెపుదూ తల్లీ నువ్వు క్షేమంగా ఉన్నావా?' అన్నాడు ఎగియూసు.

'ఓ! నిక్షేపంలా. ఎదురుగానే నిలపడ్డాగా? చూడు. ఔనుగాని, ఎగియూస్! ఇంక నువ్వెప్పుడూ ఇండియన్లని గాడిదలనీ, పందులనీ అంటే మాట దక్కదు! వాళ్ళంత మంచివాళ్లు ప్రపంచంలో ఎక్కడా ఉండరు తెలుసా?' అంది హెర్మియా.

'ఐతే నిన్ను కాపాడుత ఇండియన్లే నన్నమాట! నీ గుఱ్ఱం ఉత్తజీనుతో కనపడేసరికి నీకోసం అడవి అంతా వెతికేం. చుట్టుపక్కలఉన్న పల్లెలన్నీ వెతికేం. మనమంటే కిట్టనివాళ్లెవరో నిన్ను ఎత్తుకుపోయి దాచేసి ఉంటారని, ప్రతియిండియను ఇల్లూ సోదా చేయించాను తెలుసా? సరేకాని నిన్ను ఇంత ఆపేక్షతో చూసిన ఆ ఇండియన్లెవరో చెప్పేవుకాదు. వాళ్ళకి మంచి బహుమతీ ఇస్తాను' అన్నాడు ఎగియూసు.

'నీ బహుమతీ వాళ్ళకక్కర్లేదు. వాళ్ళలో ఒక అవ్వ ఉంది. ఆమెని చూస్తే హిపోలిటా చెప్పిన కథలో మంత్రగత్తెలాగ ఉంటుంది. ఆ అవ్వకు గ్రీకులంటే అస

 పాలంకి వెంకటరామచంద్రమూర్తి 

వ్యాం. 'బహుమతీ' అంటూ పెడితివా, నిన్ను రోకలి పుచ్చుకు తరుముకొస్తుంది!' అంది హెర్మియా.

'ఆ ఇండియన్లు ఎవరు?' అని ఎన్నిసార్లు ఎగ యీసు అడిగినా హిరణ్మయి మాట తప్పించేసి వేళా కోళం మొదలెట్టిందే కాని విశ్వజిత్తు గుహ మాట చెప్పిందికాదు.

'పోనీలే అమ్మా బ్రతికి బాగుండి కంటపడ్డావు; అదే చాలు' అని చూసుకున్నాడు.

హెర్మియా గాయత్రీదేవికి చేసిన వాగ్దానం ప్రకారం, నాడేకాదు తర్వాతకూడా ఎవరు అడిగినా అడవిలోని ఆ కుటుంబం సంగతి చెప్పలేదు. ఆగుహలో కష్టపడుతోన్న ఆ రాజకుటుంబానికి సాయపడాలని ఆమె అనేకవిధాల ఆలోచించింది కాని, ఎలాగ తోడ్ప డాలో ఆమెకు పాలుపోలేదు. వాళ్లమీద కలిగిన గౌర వంకొద్దీ ఆ బాలికకు ఏ భారతీయుడన్నా సానుభూతి ఏర్పడింది. విశ్వజిత్తు కుటుంబానికామె తోడ్పడలేక పోయినా, పుష్కలావతిలో గ్రీకుల చేతికింద బానిస లుగా శ్రమపడుతోన్న భారతీయులను ఆమె ఎంతో కనికరంతో చూచేది.

## 11

అలెగ్జాండరు చక్రవర్తి సెల్యూకసును పాల కుణ్ణిగా చేసి తన సేనలతో ముందుకు సాగిపోయాడని చెప్పేము. ఆతనికి ఆర్యావర్తమంతా జయించాలని కోర్కెగా ఉండేది. ఆర్యావర్తమంటే మనదేశంలో హిమాచల పర్వతాలకీ వింధ్య పర్వతాలకీ మధ్యనుండే దేశమంతా నన్న మాట. పంజాబునుంచి తూర్పుగా చాలా దూరం వస్తే మగధరాజ్యంఉంది. ఆకాలంలో మగధరాజ్యాన్ని మహాపద్మనందుడనే గొప్పరాజు మహావైభవంతోనూ పరాక్రమంతోనూ పాలించే వాడు. 'కొడితే ఏనుగ కుంభస్థలాన్నే కొట్టాల'ని సింహం కోరినట్లు, అలెగ్జాండరు చక్రవర్తి, 'యుద్ధంలో ఓడిస్తే మగధరాజునే ఓడించాల'ని కోరేడు.

తనతోబాటు గ్రీకువీరులలో పేరుపొందినవాళ్ళ నందర్నీ వెంటబెట్టుకు వెళ్లేడు. పారశీకంలో లేచిన తిరుగుబాటు అణిగిపోయిందన్న వార్త రావటంతోనే అక్కడఉన్న రోహిలసుకు, 'మగధముట్టడిలో నాకు సాయపడాలి కనుక రావలసింద'ని ఉత్తరువు చేశాడు.

రోహిలసుకు యుద్ధమంటే సరదాయేగాని, ఎంత సరదా ఐనపనైనా కొంతకాలమయేసరికి ఎవరి కైనా విసుగువేస్తుంది. ఆతనికి వయసు మళ్లింది. తల్లి లేనిపిల్ల హెర్మియాను చూసుకుంటూ మిగిలిన కాల మంతా శాంతంగా పుష్కలావతిలో గడిపెయ్యా లనిపించిం దతనికి. కాని చక్రవర్తిఆజ్ఞకు ఎదురు చెప్ప టానికి వీల్లేదు గనక ఎకాయెకీనివెళ్లి అలెగ్జాండరును చేరుకున్నాడు. పుష్కలావతికి వెళ్లి హెర్మియాను ఒక్కసారి చూడటానికైనా వీలులేకపోయిందతనికి.

కాని తుదకు అలెగ్జాండరు చక్రవర్తికోర్కె ఫలించలేదు. రోహిలసుకుమల్లేనే తక్కిన గ్రీకు యోధులలో చాలామందికి యుద్ధమంటే విసుగు వేసింది. జన్మస్థానమైన మాసిడోనియాదేశంలో వదిలి వచ్చిన తమ భార్యాపుత్రులపైకి ధ్యానం మళ్లి, బెంగతో వాళ్ళకి ఇంక ముందడుగు పడిందికాదు. ఆసంగతి కనిపెట్టిన చక్రవర్తి ఇంక తిరుగుముఖం పట్టక తప్పిందికాదు. అతడు మగధవరకూ వెళ్ళకుండా మధ్యలోనే సేనలతో తిరిగిపోవలసి వచ్చింది.

'ప్రభూ, దారిలో మాయింట ఒకటి రెండు రోజులు ఆగి మరీ వెళ్లాలి. తమకొరకు పుష్కలా వతిలో ప్రత్యేకం ఒకభవనం తయారైంది!' అన్నాడు రోహిలసు.

'సరే' అన్నాడు చక్రవర్తి. రోహిలసు ముందుగానే ఎగయీసుకు వార్త పంపేడు. చక్ర వర్తికి స్వాగతం ఇవ్వటానికని ఏర్పాట్లన్నీ చేయ వలసిందని ఆజ్ఞాపించాడు.

తండ్రి వస్తున్నాడనేసరికి హెర్మియా చాలా సంబరపడింది. ఆమె తండ్రిని చూసి ఏడాదిపైగా ఐపోయింది.

ఆమె అలెగ్జాండరుచక్రవర్తిని అంతకుముందు ఎప్పుడూ చూడలేదు. ఆయనకూడా వస్తున్నాడనటం తోనే తనదుస్తులలో మంచివాటిని ఆయన వచ్చినప్పుడు తొడుక్కోవడంకోసం వేరేతీసి ఉంచుకుంది.

చక్రవర్తికి స్వాగతం ఇవ్వటానికి పుష్కలా వతిలో చాలా హడావుడిగా ఉంది. బూజులన్నీ దులిపే శారు. కిటికీలకు కొత్తతెరలు కట్టేరు. నేలపై పరవ డానికి రత్నకంబళులు సిద్ధంచేశారు. చక్రవర్తికి విందు నిమిత్తం వెండిసామానంతా పైకితీసి మెరుగు పెట్టేరు.

తండ్రీ, చక్రవర్తీ వస్తున్నారేమో అని చూసిరావటంకోసం ఆమె కోట సింహద్వారం వరకూ చాలాసార్లు వెళ్లివచ్చింది. 'వస్తోంటే కొమ్ము బూరా ధ్వనులూ, జయ జయధ్వానాలూ వినిపిస్తా

యమ్మా, అప్పుడు మనం సింహద్వారంవద్దకు పోయి స్వాగతం ఇద్దాం.' అన్నాడు ఎగెయూసు.

చక్రవర్తికోసం ఎదురుచూడటంలో నాలుగు రోజులు గడిచిపోయాయి. ఐదోరోజు ఉదయమే బూరాలు వినిపించాయి. హెర్మియా బంతిలాగ ఎగిరి 'వస్తున్నారు, వస్తున్నార'నుకుంటూ పరుగెత్తింది.

ఆమె అటువంటి ఊరేగింపు ఎప్పుడూ చూడలేదు. మొదట గ్రీకుసైనికులు నడిచివచ్చారు. వాళ్ళ ఈటె మొనలూ, డాలులూ ధగధగా మెరిసిపోతున్నాయి. వెనుక గుఱ్ఱాలపైన సేనానులు వచ్చారు. హెర్మియాకు ప్రతీ సేనానీకూడా చక్రవర్తిలాగే కనపడ్డాడు. 'ఎవరు చెప్మా చక్రవర్తి?' అని ఆమె యోచిస్తూ నిలపడేసరికి ఒక పెద్ద గుఱ్ఱంమీద ఎత్తైన పురుషుడొకడు కనపడ్డాడు. ఆరుద్ర పురుగురంగులో ఉన్న ముఖమలువస్త్రాల్ని నేలకు తగిలేటంత పొడుగుగా ధరించి, ఎంతో ఠీవిగా ఉన్నాడాయన. ఆయన్ని చూడటంతోనే హెర్మియాకు, 'ఇతడే చక్రవర్తి.' అన్న సంగతి ఎగెయూసు చెప్పక్కర్లేకుండానే తెలిసిపోయింది.

ఆ విశాల వక్షస్థలం, కండలుతేరి పుష్టిగాఉన్న ఆ పొడుగాటి భుజాలూ, ఆ వెడల్పాటి నేత్రాలూ, ఆ అందమైన ముక్కూ, పట్టులాంటి ఆ జుట్టూ చూచేసరికి, హెర్మియాకి చక్రవర్తిఅంటే భయం భక్తీ పుట్టుకొచ్చాయి. 'ఈయన ఇంత గొప్పవాడు గనకనే చక్రవర్తి అయాడు!' అనుకుందామె.

చక్రవర్తిని చూస్తూ నిలపడిపోవడంలో ఆమె తన తండ్రిని గమనించనేలేదు. రోహిలసు గుఱ్ఱంమీద అలెగ్జాండరు వెనుకనే వచ్చాడు. చక్రవర్తి పుష్కలావతి కోట బురుజులను పరిశీలిస్తూ, 'రోహిలస్, చాలా గొప్ప కోట ఇది!' అని మెచ్చుకున్నాడు.

రోహిలసు తన గుఱ్ఱంమీదనుంచి ఉరికి, చక్రవర్తిపాదమున్న రికాబును పట్టుకున్నాడు. చక్రవర్తి మెల్లిగా దిగి, రోహిలస్తోనూ తక్కిన యోధులతోనూ కోట ప్రవేశించాడు.

హెర్మియా అడ్డదారిని పరుగెత్తివచ్చి, తాను చక్రవర్తికోసం కట్టిఉంచిన పుష్పమాలను పట్టుకుని, ఆయనకోసం ఏర్పాటుచేయబడిన విడిదిగుమ్మంవద్ద సిద్ధంగా నిలబడింది. ఒక్కొక్క మెట్టే ఎక్కివస్తూ చక్రవర్తి ఆమెను చూసి, 'రోహిలస్, మీ అమ్మాయి కదూ?' అన్నాడు.

'ఔను ప్రభూ' అన్నాడు రోహిలసు. చక్రవర్తి సమీపించటంతోనే హెర్మియా ఎగెయూసుతో, 'నన్ను ఎత్తుకో!' అంది. ఆమె అలాగ ఎందుకు ఆజ్ఞాపించిందో తెలియకుండానే ఎగెయూసు ఆమెను ఎత్తుకుని భుజాలపైన కూర్చోపెట్టుకున్నాడు. ఆమె అలెగ్జాండరుతో, 'ప్రభూ, ఆగండి!' అంది. చక్రవర్తి ఆగిపోయాడు. రోహిలసు, 'ఏంచేస్తుందో?' అని కంగారుపడ్డాడు. హెర్మియా తన చేతిలో ఉన్న పూలమాలను చక్రవర్తి తలకు చుట్టబెట్టింది. అలెగ్జాండరు సంతోషించాడు. చక్రవర్తి ముఖంమీది చిరునవ్వుచూసి రోహిలసు, కుమార్తె తన పరువు నిలబెట్టిందని పొంగిపోయాడు.

చక్రవర్తి హెర్మియా గులాబీబుగ్గపై మెల్లిగా తట్టి భవనం ప్రవేశించాడు. రోహిలసు ప్రేమపూర్వకంగా కుమార్తె తలను ఒక్కసారి నిమిరి ఎగెయూసు వైపు తిరిగి 'ఎవడో ఇండియను ఒకణ్ణి ఖైదీగా తీసుకొచ్చాము. గదిలోపెట్టి తాళంవెయ్యి పారిపోకుండా చూడు. వాడు తప్పించుకుపోయాడంటే చక్రవర్తి నీబుర్ర తీయించేస్తాడు జాగ్రత్త!' అనిచెప్పి, తొందరగా లోపలికి వెళ్లేడు.

'ఎవడుచెప్మా, ఈ ఇండియను?' అనుకుంటూ హెర్మియా ఎగెయూసును అనుసరించి వెళ్ళింది. ఇద్దరు గ్రీకుసైనికులమధ్య, చేతులు రెండూ చేర్చి బంధింపబడి వస్తూన్న ఆ ఖైదీని ఆమె చూచింది. చూడటంతోనే ఆమె ముఖం తెల్లబడిపోయింది. గుండె ఆగిపోయినట్లయి, ఆమె కొయ్యలా నిలబడిపోయింది. అందుకు కారణం, ఆ ఖైదీ మరెవరో కాదు; ఆమెను అడవిలో కాపాడి తుదకు పుష్కలావతికి క్షేమంగా చేర్చిన హారప్రియుడు!

## 12

ఆ స్థితిలో హారప్రియుణ్ణి చూడటంతోనే హెర్మియా ఆనందమంతా మటుమాయమైంది. ఎగెయూసు హారప్రియుణ్ణి తీసుకుపోయి ఒకగుఱ్ఱాలశాలలో పెట్టి, తలుపుతాళం వేసి చక్కావచ్చాడు.

'వీ డెవడో తెలుసా? చక్రవర్తిపై తిరుగుబాటు చేసిన విసుజసు కొడుకేనట! చక్రవర్తి పరివారంతో

వస్తోండగా చూసి అడవిలో వీడు గబగబా ఒక చెట్టుక్కుతో దొరికిపోయాట్ట. మన సైనికులు కనిపెట్టి, 'దిగు' అన్నారట. వీడు 'దిగను' అనేసరికి సైనికులలో ఒకడు చెట్టుఎక్కి కిందికి లాక్కొచ్చాడుట. మొదట ఎవరో ఇండియను అనుకుని వదలిపెయ్యమన్నారు. కాని మన సైనికులలో ఒకడు వీణ్ణి విసుజిసు కొడుకని గుర్తుపట్టి చక్రవర్తితో వెళ్లి చెప్పేడు. చక్రవర్తి వీణ్ణి రప్పించి, 'మీ తండ్రి ఎక్కడ? మామీద తిరుగుబాటు చేశాడటగా?' అని గద్దించి అడిగేడు. ఎంతభయపెట్టినా ఈ మొండివాడు మాట్లాడలేదుట. 'చెట్టుకు కట్టేసి కొరడా పుచ్చుకు కొడితే వాడే చెబుతాడు!' అని సలహా ఇచ్చారుట కొందరు. కాని చక్రవర్తి, 'తీసుకుపోయి రెండురోజులు వస్తుపెడితే వాడే చెపుతాడు!' అని ఖైదీగా తీసుకొచ్చారుట.' అంటూ ఎగెయూసు జరిగిన కథంతా హిపోలిటాకు చెపుతోంటే హెర్మియా వింది.

'ఎగెయూస్, వస్తుపెట్టినా తన తండ్రి ఎక్కడున్నదీ ఈ ఖైదీ చెప్పడనుకో. అప్పుడేం జరుగుతుంది?' అని అడిగింది హెర్మియా.

'ఏం జరుగుతుందా? తీసుకుపోయి ఉరిదీస్తారు' అన్నాడు ఎగెయూసు.

ఉరిదీస్తారనటంతోనే ఆమెకు ముచ్చెమటలు పోశాయి. హారప్రియుణ్ణేనా ఉరితియ్యటం? ఆమెను ఎంతో ప్రేమతో చూచిన తుమావతి అన్ననేనా ఉరితియ్యటం? వాళ్ళఅమ్మ గాయత్రీదేవి ఆమెను కన్నతల్లికన్నా ఎక్కువగా చూసింది...విశ్వజిత్తు గుహలో ఆమె గడిపినరోజులు ఒక్కమారు ఆమెకు కళ్ళకు కట్టినట్లయి, 'హారప్రియుణ్ణి మా నాయనతో చెప్పి వదిలించాలి. వాళ్లెంత మంచివాళ్లో మా తండ్రితో చెపితే, ఆయన చక్రవర్తితో చెప్పి హారప్రియుడికి ఏహానీ రాకుండా చేస్తాడు.' అనుకుంది. కాని తండ్రితో మాట్లాడడానికి ఆమెకు ధైర్యం చాలిందికాదు. తండ్రే వినా రోహిలనువద్ద ఆమె కంత చనువులేదు. ధైర్యం చేసిచెప్పాలన్నా ఆమెకు మరొక అభ్యంతరం కనబడింది. చెప్పడమంటూ వస్తే విశ్వజిత్తు గుహసంగతి చెప్పక తప్పదు. ఆసంగతి చెప్పనని ఆమె గాయత్రీదేవికి మాట ఇచ్చింది. తీరా వాళ్ళరహస్యం బట్టబయలుచేస్తే హారప్రియుడికి ఉపకారం జరగటంమాట అటుంచి, గుహలోనివాళ్ళందరికీ ముప్పు వస్తుందేమో?

ఈ ఆలోచనలతో ఆమె ఆరోజంతా గడిపింది. పుష్కలావతిలోని వాళ్ళంతా చక్రవర్తి వచ్చాడన్న సందడిలో ఉన్నారుగనుక నాడు ఆ బాలిక పడుతోన్న బాధ ఎవరికీ తెలిసిందేకాదు. రాత్రి విందుకు చేయవలసిన ఏర్పాట్లన్నీ చేసి, కొంచెంసేపు విశ్రాంతి తీసుకుందామని ఎగెయూసు ఒకచోట గోడకు చేరగిలపడ్డాడు. హెర్మియా వెళ్ళి వాని ఒడిలో కూర్చుని, 'ఎగెయూస్, నీతో ఒక సంగతి చెప్పాలి. ఈ రహస్యం నువ్వెవరికీ తెలియనివ్వకూడదు.' అంది.

వాడు చిరునవ్వుతో, 'ఏమిటితల్లీ, ఈ పరమ రహస్యం?' అన్నాడు.

'నువ్వు గుర్రాలశాలలోపెట్టి తాళంవేసివచ్చిన ఆ అబ్బాయే నన్ను ఆనాడు అడవిలో రక్షిస్త! నన్ను వాళ్ల నివాసానికి తీసుకువెళ్లి తల్లికి వప్పగించాడు. ఆమె రోజూ నాకాలికి కట్టుకట్టి కుదిర్చింది. అక్కడ ఉన్నన్నాళ్లూ వాళ్లంతా నన్ను ఎంతో ప్రేమతో చూశారు. అతనికేమీ అపాయంరాకుండా నువ్వు చూడాలి'.

ఎగెయూసు ఆశ్చర్యపోయి 'నిజంగానా? ఇలాగ పట్టుపడిపోకుండా కాస్త జాగ్రత్తగా ఉంటే ఎంత బాగుండిపోను! కాని ఇప్పుడు అనుకుని ఏమిలాభం?' అన్నాడు.

'ఇప్పుడేం చెయ్యాలంటావు మరి?' అంది హెర్మియా.

"ఏంచెయ్యడానికేముంది? చక్రవర్తి వాణ్ణి తన సమక్షానికి రప్పించి, 'మీ తండ్రి ఎక్కడదాగిఉన్నాడో చెప్పు' అని అడిగినప్పుడు ఏమీ దాచకుండా చెప్పేస్తే ఆయన కనికరించి వదిలెయ్యవచ్చు" అన్నాడు ఎగెయూసు.

'హారప్రియుడు ప్రాణంపోయినా తమగుట్టు బైటపెట్టడు. తనవాళ్ళకు ఆపదరాకుండా చూచుకోడంకోసం తన ప్రాణాలను వదిలేస్తాడేగాని వాళ్లెక్కడున్నదీ చెప్పడు!' అంది హెర్మియా.

'చెప్పకపోతే అనుభవిస్తాడు!' అన్నాడు ఎగెయూసు.

'అబ్బే. అలాగంటే ఎలాగ ఎగెయూస్? హారప్రియుణ్ణి నువ్వే రహస్యంగా వదిలెయ్యాలి.'

'వదిలెయ్యడమే! నేనా? చక్రవర్తిఆజ్ఞనా ధిక్కరించమంటున్నావు?' అంటూ మెడమీద తల ఉందో లేదో తడిమి చూసుకున్నాడు ఎగెయూసు.

'నీకంతభయమైతే మానాయనతో చెప్పు పోనీ.

## ★ హిరణ్మయి ★

ఆయన చక్రవర్తితో చెప్పి, వదిలిపించేస్తాడు.' అంది హెర్మియా.

'మీ నాయన ఎన్నడూ అంత తెలివితక్కువ పని చెయ్యడు. విసుజిసు తిరుగుబాటు చేశాడు. తిరుగుబాటుచేసినవాళ్ళంటే అలెగ్జాండరుకు కనికారం లేదు. చేజిక్కినకుర్రవాణ్ణి వదిలి విసుజిసును పట్టుకోడానికి దొరికిన ఈ ఒక్క అవకాశం అలెగ్జాండరు పోగొట్టుకుంటాడనా నీఉద్దేశం?' అన్నాడు ఎగెయూసు.

"రోహిలసుతో ఈ ప్రస్తావనతెస్తే హెర్మియా అడవిలో తప్పిపోయినదన్న సంగతి ఆయనకు తెలియటం, దానితో ఆయన నన్ను 'అంత అజాగ్రత్తగా ఉన్నావన్నమాట!' అని చివాట్లు పెట్టడం జరుగుతుంది. ఆయనతో ఈ గొడవచెప్పడం కొరివితో తల గోక్కోవడం లాంటిది." అని ఆలోచించి ఎగెయూసు హెర్మియాతో, 'ఈ ఇండియను ఎలాగపోతే నీకెందుకు తల్లీ? ఇండియన్లకీ పశువులకీ ఆట్టే తేడా లేదు...' అని ఇంకా ఏదో అనబోతుంటే, ఆమె కోపంతో వానివడిలోంచి చివాలున లేచి, 'ఎగెయూస్, వాళ్లు కాదు పశువులు! మనం! గ్రీకుల క్రౌర్యాన్ని తలుచుకున్నప్పుడల్లా ఈజాతిలో పుట్టినందుకు నాకు సిగ్గువేస్తోంది!' అంది.

ఎగెయూసు నిర్ఘాంతపోయాడు. ఏమీ అనలేక ఆఖరికి, 'చిన్న పిల్లవు నువ్వు. ఈ రాచకీయాలలో కలగచేసుకోకూడదు. ఇంతకీ నావల్ల నయ్యేదేమీ లేదు. నేను చక్రవర్తి ఆజ్ఞను ఎలాగ జవదాటగలను?' అన్నాడు.

ఆమె కోపంతోనే తన గదికి పోయి, మంచం మీద బోరగిలా పడుకుని వెక్కివెక్కి ఏడ్చింది. 'ఎంతో గొప్పవానికిమల్లే కనపడే ఈ చక్రవర్తి ఇంత రాతిగుండెవాడా?' అనిపించిందామెకు.

రాత్రి విందుకంతా సిద్ధమైంది. 'హెర్మియా ఏది?' అన్నాడు రోహిలసు. హిపోలిటా వెతుక్కుంటూ హెర్మియాగదికి వచ్చి, 'ఏమమ్మా, ఏడుస్తున్నావేమిటి? దేనికోసం? ఎర్రబారిపోయిన ఈ కళ్లు చూస్తే చక్రవర్తి ఏమనుకుంటాడు! అబ్బే. లే. ముఖం తుడుచుకో.' అంది.

హెర్మియా, 'చక్రవర్తి ఏమనుకుంటే నాకేం?' ఆయనముఖం చూడాలనే లేదు నాకు! ఆయన అంటే నా కసహ్యం వేస్తోంది!' అంది.

హిపోలిటా నిర్ఘాంతపోయి, 'ఏమిటి తల్లీ ఈ మాటలు! లే. మీ నాయనగారు తీసుకురమ్మన్నారు. నువ్వు రాకపోతే ఆయనకు కోపం వస్తుంది' అంటూ బుజ్జగించి తీసుకుపోయింది.

అలెగ్జాండరుచక్రవర్తి కులాసాగా కబుర్లు చెపుతున్నాడు. హెర్మియాను చూడటంతోనే అతడు ఆమె నిరుత్సాహంగా ఉండటం కనిపెట్టి,'ఏమమ్మోయ్, ఎందుకూ ఏడ్చినట్లున్నావు? చందమామకోసమా?' అన్నాడు ఎగతాళిగా.

ఆమె సమాధానం చెప్పలేదు. రోహిలసుకి ఆమెమొహం చూసేసరికి చిరాకువేసింది. ఆమెను తీసుకుపోవలసిందని హిపోలిటాకు సంజ్ఞచేశాడు.

(ఇంకా వుంది.)

# వింత షరతు

గోపీ ఎంతో జాగ్రత్తగా అడుగు మీద అడుగు వేసుకుంటూ మేడమీద గదిలో పెట్టె దగ్గర పోయికూర్చున్నాడు. పెట్టె తెరిచే ముందు ఒకసారి వెనకకు తిరిగి చూశాడు. ఎవరూ లేరు. ఒకమూల గుడ్డిదీపం వెలుగుతోంది.

జేబులోని మేకుతీసి పెట్టె తాళంతీశాడు. మూత తెరిచి మళ్ళీ ఒకసారి ముందు వెనకా చూసి పర్సు ఎత్తడం మంచిదని వెనక్కు తిరిగాడు. గుండె జల్లుమంది. పెట్టె మూసేశాడు.

"ఏం చేస్తున్నావు గోపి?" అని అడిగాడు శంకర్.

"నాకు రూపాయి కావాలి. తీసుకుంటున్నా" అన్నాడు గోపి.

"తీసుకోడానికి సమయం సందర్భం. లేదా" అన్నాడు శంకర్.

"శంకర్! యిది మా నాన్న డబ్బు. నాయిష్టంవచ్చినప్పుడు తీసుకుంటా" అన్నాడు గోపి.

"అయితే అందుకు దొంగలాగా భయపడుతూ మెట్లెక్కి వచ్చావెందుకు?" అని ప్రశ్నించాడు శంకర్.

"అదంతా నీ కనవసరం. మానాన్నతో చెప్పినా నాకు భయంలేదు." అన్నాడు గోపి; అన్నిటికి తెగించిన వాడిలా.

"అయితే చెప్పమంటావా గోపీ" అని అడిగాడు శంకర్.

"మా నాన్నతోనా?" దిగులుగా అడిగాడు గోపి.

"కాదు, నీకు బుద్ధిచెప్పమంటావా?" అన్నాడు శంకర్.

"చెప్పు చూద్దాం ఎలా చెబుతావో" అన్నాడు గోపి నవ్వుతూ.?

"నీ కెంతకావాలో తీసుకో" అన్నాడు శంకర్.

"ఇవాల్టికి రూపాయి చాలు" అన్నాడు గోపి.

## గోటూరి భవానీశంకర్

"అయితే ఒకషరతు, రేపు బడికి పోకుండా నాతోనే వుండాలి. దీనికి ఒప్పుకుంటే రూపాయితీసుకో. లేదా నేనే యిప్పుడే మీ నాన్నగారికి సంగతి చెప్పేస్తా" అన్నాడు శంకర్.

గోపి సంతోషంగా "అంతేకదా శంకర్! రక్షించావ్. నీతోనే సాయంకాలం వరకు వుంటాను సరేనా?" అన్నాడు గోపి.

"మరొక మాట గోపీ! ఎవరు ఎంత అడిగినాగాని నేను నిన్ను చెప్పమన్నంత వరకు నిజం చెప్పకూడదు." అన్నాడు శంకర్.

"అంతేనా. పిచ్చి షరతులు వుంచావు" అని గోపి రూపాయితీసి జేబులో వేసుకున్నాడు.

అంతటితో అప్పటికి వారిసంభాషణ ముగిసింది.

తెల్లవారింది. "మార్కెట్టుకు ఎవరుపోతారు?" అని అడిగారు సుధాకరరావు. ఎప్పుడూ శంకర్ "నేను వెళతానండి" అనేవాడు. కానీ ఆవేళ "ఈరోజు గోపీకి వొంట్లో బాగుండలేదండి. అంచేత నేను యిక్కడే వుంటాను. వేణును వెళ్ళిరమ్మనండి" అన్నాడు.

"అన్నదమ్ములిద్దరిదీ పోటీ బ్రతుకులు కదరా? వాడికి వొంట్లో బాగాలేదని పడుకుంటే వీడు బాగున్నాగాని పడుకుంటాడు" అని అసంటంతోనే "అవున్లే నాన్నా! వాడికి జబ్బుచేస్తే నమ్ముతారు. నాకేదయినావస్తే వట్టిదే అంటారు" అని ముక్కుతో వేణు గొణిగాడు.

"సరి సరి గొంతెత్తబోకు. వినడానికిక్కడ ఎవరూ సిద్ధంగా లేరు. ఇప్పుడు మార్కెట్టుకు వెడతావా లేదా? అని అడిగాడు సుధాకరరావు.

"వెడతా. చివరికి నేను చెయ్యాల్సిందే" అని సంచితీసుకుని, నిలిచాడు వేణు.

"ఏం. ఏం నిలిచిపోయావు. రోజులాగా అణా దక్షిణ పెట్టడానికి చిల్లరలేదు. రేపు రెండురోజులది

రో బట్టుకుందువుగాని వెళ్లు" అన్నారు సుధాకరరావు.

"అసలుకు డబ్బివ్వకుండా, నేనెలా మార్కెట్టుకుపోయేదినాన్నా, నాకేం దక్షిణవద్దులెండి. రేపునుండి అన్నయ్యేవెళ్ల మనండి" అన్నాడు వేణు ఏడుస్తూ.

"నీకు ముక్కుమీదే వుంటుందిరా ఏడుపు" అని డబ్బు తేవటానికి లోపలికి వెళ్లాడు సుధాకరరావు.

వేణు చొక్కాతో కన్నీళ్లు తుడుచుకుంటూ తుడుచుకుంటూ శంకర్, గోపీలు తనేడుస్తున్నందుకు నవ్వుతున్నారేమో అని చూచాడు. వాళ్లు నవ్వినట్టయితే సంపీ అక్కడ పారేసి నాన్నగారిచేత వాళ్ళిద్దరికీ చీవాట్లు పెట్టిద్దామనుకున్నాడు. కాని వాళ్లు నవ్వితేగా. ఒకరి మొఖాలు ఒకరు చూసుకుంటూ కూర్చున్నారు.

అంతలో రౌద్రంగా సుధాకరరావు వేణు ముందు ప్రత్యక్షమయ్యారు. వేణు స్తంభించిపోయి నిలుచున్నాడు.

"కమలా! కమలా!" అని గర్జించాడు సుధాకరరావు. కమలమ్మ ఆ కేకలకు సుడిగాలిలావచ్చి సుధాకరరావుముందు నిలిచింది.

"నిన్న సాయంకాలం నాపర్సులో ఒక పది రూపాయిల నోటు ఒక రూపాయి వుంచాను. ఇప్పుడు చూస్తే లేదు. ఏ యక్షిణి మాయం చేసింది" అని చాలా కోపంగా అడిగారు ఆయన.

"అదేమో నాకేం తెలియదండి. మీరు పొరబాటుబడ్డారేమో మళ్ళీ చూడండి" అన్నది కమలమ్మ.

"పొరపాటు నేను పడతానా. బావిలోఅయినా పడతాగాని. నేను లెక్కల మాష్టర్ని. తెలుసా" అన్నాడు

"నేను తీయలేదండి" అన్నాడు వేణు.

"నేను ఎవరెవరు తీయలేదని జాబితా రాసుకోడంలేదు. అంత ఓపికకూడా నాకులేదు. తీసుకున్నవాళ్లు ఆరూపా యక్కడ పెట్టిపోండి" అన్నాడు సుధాకరరావు.

"మనవాళ్లు ఎవరూ తీసివుండరండి" అంది కమలమ్మ.

"మనయింట్లో మనవాళ్లుగాక పరాయివాళ్లు ఎవరున్నారూ?" అని సూటిగా అడిగాడు సుధాకరరావు.

"అట్లా అడిగితే ఎలాఅండి?" అంది కమలమ్మ.

"చెప్పాలి మరి. పరాయివాళ్లెవరు? వాళ్లెట్లా తీసివుంటారు?" అని ఆపి అంతలో ఎదురుగావున్న వేణునుచూసి "ఇదిగో యీ పది రూపాయలనోటు తీసుకుపోయి కూరగాయలుతీసుకుని చిల్లర జాగ్రత్తగా పట్టుకురా! ఏం?" అని నోటు వేణుచేత పెట్టాడు.

వేణు మాట్లాడకుండా నోటు తీసుకుని వీధిగేటు దాటి వెళ్లిపోయాడు. వేణు గడపదాటి వెళ్ళిపోయినతరువాత "ఎవరు తీసివుంటారంటావు కమలా" అన్నాడు సుధాకరరావు.

"ఎవరని చెప్పనండి" అన్నదామె.

"ఇందాకా ఏదో అన్నావుగా" అన్నాడాయన.

"అదేనండి మనగోపి, వేణూలు తీసివుండరండి" అన్నది కమలమ్మ.

"అయితే నీకు పరాయివాళ్ళయిన నా చెల్లెలో, దానికొడుకు శంకరో నేనో..."

చైనీస్ కథలు - ఫెంగ్ స్వే ఫెంగ్ :

# 11. పిల్లి, ఖాళీకుండ

ఒక పిల్లి తినడానికేమన్నా దొరుకుతుందేమోనని ఆశతో అటక ఎక్కింది. మొదటిగా, మూతలేని కుండ ఒకటి కనిపించింది. తీరా చూస్తే అది ఖాళీకుండ "ఇందులో బహుశా ఏమీ ఉండదు. చూడడం అనవసరం," అనుకున్నది. ఇంకోమూల ఇంకో కుండ కనిపించింది. దానిమీద గట్టిమూత ఉన్నది పిల్లి దానికేసి చాలసేపు పరీక్షగా చూసింది. "అబ్బో, దీని నిండా ఏదో ఉంది. తినడానికి కావలసినంత సరుకు!" అనుకుంది. చూసిన కొద్దీ, దానికి నోరూరి ఇక ఏమాత్రం ఆగలేక పోయింది. ధైర్యంచేసి మూత పడదోసింది. పాపం అదీ ఖాళీగానే ఉంది.

పొర్లిపొర్లి వచ్చే దుఃఖం ఆపుకుని పిల్లి ఇలా అంది: "ఈ కుండలన్నీ ఖాళీవే. కొందరి బుర్రలు ఖాళీగా ఉంటే, ఖాళీగా ఉన్నాయని నిజం చెప్పేస్తారు. మరి కొందరు అలా చెప్పరు. చాలా గంభీరంగా, నిజంగా తమ బుర్రల్లో ఏదో ఉందన్నట్టు మొహం పెడతారు. నాలాంటి అమాయకులు కామోసనుకుని నమ్ముతారు. తీరా చూస్తే వాళ్లవికూడా ఖాళీ బుర్రలేనని బయటబడుతుంది."

★ వింతవరతు ★

"అట్బే మీరు పరాయివాళ్ళని నే నన్నా నాండి" అన్నది ఆమె.

"మరయితే నాచెల్లెలు దాని కొడుకు పరాయివాళ్ళని తేలిపోయింది. నరే ఒప్పుకుంటా. వాళ్ళెట్లా తీసివుంటారు? వేసిన బీగం వేసినట్లేవుందిగా" అన్నా డాయన.

"మారుబీగాలతో తీసి వుంటారండి" అంది గుడ్లు పెద్దవిజేసి.

"వారి కెందుకు రూపాయి? అన్నివసతులు మన యింటిలోనే వున్నవిగా" అని ప్రశ్నించాడు ఆయన.

"డబ్బు కక్కుర్తి ఎవరి కుండదండి?"

"అదేకమలా నా చెల్లెలుకూడా ఒకమాట అంది ఏమిటో తెలుసా?" అన్నాడు.

"ఏమన్నదండి?"

"మనవాళ్లు ఎవరూ తీసివుండరురా అన్నది. అయితే మనవాళ్లెవరు చెల్లమ్మా అన్నాను. నీవు నేను మన శంకర్ అని బదులు చెప్పిందామె." అని అన్నాడు.

కమలమ్మకి వొళ్లు జల్లుమంది. వెంటనే "అయితే మేము పరాయివాళ్ళమ్మాండి. మేము దొంగతనం చేశామాండి?" అంటూ ఏడ్వడానికి మొదలుపెట్టింది.

"ఏం ఎందుకు కాకూడదు? డబ్బు కక్కుర్తి ఎవరికైనా వుంటుంది. అసలు నీవే తీసివుండవచ్చు" అని సుధాకరరావు అనేసరికి కమలాదేవి నోరు తెఱవలేకపోయింది. భర్త తనను అనుమానిస్తాడని ఆమె కలలోకూడా అనుకోలేదు.

వెంటనే తలుపువెనుక ఈమాటలు వింటున్న గోపి "చూశావా శంకర్! నాన్న అమ్మనే దొంగ అనేశాడు" అన్నాడు చిన్నగ. శంకర్ గోపిని పైకి తీసుకవెళ్ళిపోయాడు.

సుధాకరరావు "ఏం కమలా! మాట్లాడకుండా నిలచిపోయావు?" అని ప్రశ్నించాడు.

"ఏముందండి నన్నే అనుమానిస్తే నేనేం అనగలను" అంది ఆమె.

"అనుమానించక ఏం చెయ్యమంటావు? ఎవరుతీశారు అని అడిగితే మనవాళ్లు అట్లాంటిపనులుచేసి వుండరండి అన్నావే! ఏం నమ్మకం. మనవాళ్ళనికూడా అడిగి చూడాలి కదా. పరాయివాళ్ళయినంత మాత్రాన వాళ్ళకు పరువు మరి యాద వుందనుకోకపోవడం చాలా పొరబాటు. నీవన్నమాటలే నా చెల్లెలో శంకరో వినివుంటే ఎంతగా బాధపడేవారో తెలుసా" అన్నాడు సుధాకరరావు.

"నరేనండి. ఏదో తెలియక అన్నాను. వేణు రాగానే కనుక్కుంటానండి" అంది ఆమె.

అది, యిది, మాట్లాడుతున్నంతలోనే వేణు మార్కెట్టునుండి వచ్చాడు. కమలమ్మ వేణు చేతిలోనిసంచిని తీసుకొని, "ఏరా! నీవేకదూ నాన్న పెట్టెలోనుండి రూపాయి దొంగిలించావు. నిజం చెప్పు" అని భయపెట్టి అడిగింది.

"లేదమ్మా. దేవుడిసాక్షిగా లేదమ్మ" అని వేణు బోరుమని ఏడ్చేశాడు.

ఆ ఏడుపు విని మేడమీద మాట్లాడుకుంటున్న శంకర్ గోపీలు దిగిచ్చారు. వస్తూవస్తూ "నాన్న అమ్మమీద అనుమానంతో ఏదయినా అని వుంటాను. నేడు పోయి నిజం చెప్పేస్తా" అన్నాడు గోపి."

"నాకేం మాటయిచ్చావు గోపీ? దానిప్రకారం నేను చెప్పమన్నంత వఱకు నీవు నిజం చెప్పకూడదన్నాడు" శంకర్.

హాల్లో అమ్మా నాన్నలముందు వేణు చొక్కాతో కళ్లనీళ్లు తుడుచుకుంటున్నదృశ్యంచూచి యిద్దరూ దూరంగా ఆగిపోయారు.

"ఇంకేం! నీ పెద్దకుమారుడు గోపాలకృష్ణుణ్ణి విచారించు" అన్నాడు భార్యతో సుధాకరరావు.

"అంతేగాని మీరు ఆ శంకర్‌ను ఒకమాటకూడా అడగరన్నమాట. నా పిల్లలంటే అంత లోకువలెండి" అని కమలమ్మ ఏడుస్తుంటే, "ఒరే శంకర్" అని సుధాకరరావు యిల్లు యెగిరిపోయేటట్టు అరిచాడు. శంకర్ భయంగా సుధాకరరావుముందు వచ్చి నిలిచాడు.

"నిజం చెప్పరా శంకర్! రూపాయి నీవేకదా తీసింది. నిజం చెప్పేంతవఱకు నీ కన్నంలేదు. ఈ స్థలంవదలి కదలడానికి వీలులేదు" అని చాలాకోపంగాఅన్నా డాయన.

"మామయ్యా! ప్రమాణంగా నేను తియలేదు మామయ్యా" అన్నాడు శంకర్.

"నిజంచెప్పు నేను కనుక్కున్నానంటే తోలుచీరేస్తాను." అన్నా డయన.

"నిజం చెబుతున్నాను మామయ్యా! నేను తీయలేదు" అన్నాడు శంకర్.

"నీవు ఖర్చుపెట్టేసివున్నా ఫరవాలేదు. ఏమీ అనరులే" అన్నది కమలమ్మ, నయంగా శంకర్‌నోట నిజం చెప్పించాలన్నవుద్దేశంతో.

"నే చెబుతొన్నదే నిజం అత్త, య్యా! నేను తియలేదు" అన్నాడు శంకర్.

అంతలో వుతికినచీర ఆరవేయ డానికి సుధాకరరావుగారి చెల్లెలు, శంకర్ తల్లీ అయిన - మంగమ్మ ఆ వంకవచ్చి జరుగుతున్న వ్యవహారం అర్థంగాక "ఏమిటి వదినా?" అని అడిగింది.

"ఇప్పుడేగా మీ అన్నగారికి మా మీద పితూరీలు చెప్పారు, అప్పుడే మరచిపోయి అడుగు తున్నారేం?" అన్నది కమలమ్మ ముఖం త్రిప్పుతూ.

"ఏంఅన్నయ్యా! ఏమిటిసంగతి? వదినేమిటి అలా మాట్లాడుతూంది" అని మంగమ్మ అమాయకంగా అడి గింది.

"మీ వదినెనోటికి గోదావరి వర దకు అడ్డులేదు చెల్లెమ్మా." అని, కమలమ్మవైపు తిరిగి "కమలా! యిందాక మా చెల్లెలు చెప్పినట్టు నీతో నాల్గుముక్కలు అన్నానే, అది నా కల్పన. నీవు మనవాళ్లు అని ఈ కుటుంబాన్ని విడదీసి చెప్పి నందుకు నేనలా కల్పించి చెప్పాను. చెల్లెమ్మ అట్లాంటిదికాదు" అని వివరించి విశదంగా భార్యకు చెప్పా డాయన.

"కాదుకాదు. ఇక్కడ ఎవ్వరూ చెడ్డవాళ్లుకాదు. నేను నాబిడ్డలే" అన్నది కమలమ్మ.

"జరిగిందేమిటో చెప్పు వదినా!" అని అర్థంగాక మంగమ్మ అడిగింది.

ఏమీలేదమ్మా ఎవరో మీ అన్నయ్యగారిపర్సులో రూపాయ తీసేశారు; అందుకు ఫలితంగా "నేను, నా బిడ్డలు దొంగలమై పోయాము" అన్నది కమలమ్మ.

కమలమ్మ నేర్పుగా మాట్లాడినదాం లోని అంతరార్థాన్ని మంగమ్మ గ్రహించింది. సుధాకరరావుకూడా తెలుసుకున్నాడు. మంగమ్మ మాటకుమాట అనేరకం కాక పోయినా యితర్లు చురుగ్గా మాట్లా డితే ఓర్చుకునేరకంకాదు.

మంగమ్మ కుమారుడివైపు కోపంగాచూసి "శంకర్! రూపా యక్కడపెట్టి నీ మూట ముల్లె గట్టు కుందువుగాని రా." అంది.

"ఏమిటి చెల్లాయి! ఎందు కంత తొందరపడతావు" అన్నాడు సుధా కరరావు. కానీ అందుకు మంగమ్మ బదులుపల్కలేదు. గోడకు తగిలించి వున్న పగడాలపూలతీసి మెడలో వేసుకుంది.

గోపి దుఃఖిస్తూవచ్చి శంకర్ ప్రక్కనిలిచాడు. శంకర్ "అమ్మా! నే తీసుకోలేదమ్మా!" అన్నాడు. మంగమ్మ గబగబా తన కొంగు మూట విప్పి "ఇదిగోనమ్మా! నా కుమారుడు దొంగతనంగా తెచ్చి యిచ్చినరూపాయి. చచ్చేంతవరకు ఈ బుద్ధిపోదు వాడికి" అని కమ లమ్మ ముందున్న బెంచీమీద వుంచి "ఏరా శంకర్! అట్లా నిలు చున్నావు? యిలారా" అని పెరటి వైపు శంకర్‌తో వెళ్ళిపోయింది.

తన యింటిలో తప్ప మంగ మ్మకు యింకెక్కడా నీడలేదని సుధాకరరావుకు బాగా తెలుసు. మంగమ్మ కంట్లో ఒక నీటి చుక్క రాలితే సుధాకరరావు కళ్ళు చెరువు లయి పోతాయి.

"కమలా మీ వదినెకి నచ్చ చెప్పి యిక్కడే వుండేటట్టుచూడు." అని సుధాకరరావు వీధి వైపు వెళ్లి పోయాడు.

"చూశావా గోపీ! శంకరే డబ్బు తీసి వాళ్లమ్మ దగ్గిర యిచ్చాడట. ఈ విధంగా యెన్ని రోజులనుండి యిస్తున్నాడో? ఒకరోజు కాక పోయినా ఒకరోజు దొంగతనం బయటపడకపోదు. ఛీ, తిన్న యింటి లోనే దొంగతనం ఎలా చేస్తార్రా! దొంగతనం కన్నా తప్పుడు పని వుందా? ఛీ, ఎంతనీచం" అన్నది శంకరే ఆపని చేసివుంటాడనుకున్న కమలమ్మ.

'తల్లి దొంగతనం గురించి

నీచంగా చెబుతుంటే గోపి అతిట్లు తనకే తగిలాయని తెలుసుకుని చాలా ఖిన్నుడయిపోయాడు. తన వల్లే ఏపాపమూ ఎఱుగని మంగమ్మ శంకర్‌లమీద అపనింద పడిందని చాలా బాధపడ్డాడు. అక్కడనుండి మేడమీదకు వెళ్లిపోయాడు.

వేణును తీసుకుని కమలమ్మ వంటింటిలోకి వెళ్లిపోయింది.

మేడమీదకుపోయి ఏం చేయటానికి తోచక తాను చేసినతప్పుకు ఏడుస్తూ కూర్చున్నాడు గోపీ. కొంతసేపటికి శంకర్ వచ్చాడు. శంకర్‌ను చూస్తూనే గట్టిగా ఏడుస్తూ "క్షమించు శంకర్! నేను చాలా పెద్దతప్పుచేశాను"అన్నాడు.

"నేనూ, మా అమ్మ వూరికి పోతున్నాం. నీకు చెప్పిపోదామని వచ్చాను" అన్నాడు.

"వద్దు శంకర్. నావల్ల నిన్నూ, అత్తయ్యను అమ్మ ఏమేమో అన్నది. మిమ్మల్ని అమ్మ ఏదేదో అంటుంటే నన్ను ముక్కలుగా ఎవరో తరిగేసినట్టయింది. నేనొక్కణ్ణి దొంగతనంచేసి పెద్దవాళ్ల మధ్య విరోధాలు కలిగించాను. నీవే దొంగతనం చేశావని అమ్మ నమ్మి దొంగతనం నీచమయిందని అసహ్యించుకుంటుంటే నేను బురదగుంటలో పడి అల్లాడినట్టు వుంది శంకర్! ఇక ఎప్పుడూ నేనిట్లాంటి వెధవపని చెయ్యను" అని దీనంగా ఏడుస్తూ అన్నాడు.

"పట్టుదలలో, పంతంలో మీ నాన్నకు ఏమాత్రం తీసిపోదు మా అమ్మ. మాట అన్నదంటే అయ్యేంతవఱకూ ఆగదు. వూరికి పోయివస్తా" అన్నాడు శంకర్.

"నీవు, అత్తయ్యా నావల్లయింటి నుండి వెళ్లిపోతున్నారా? నేనేం చెయ్యగలను శంకర్" అన్నాడు గోపి దిక్కుతోచక.

"ఒకసారి గాంధీగారు ఏం చేశారో తెలుసా గోపీ! గాంధీగారు కూడా దొంగలించారు. నీలానే తాను చేసింది తప్పని తెలుసుకుని బాధపడ్డారు. వెంటనే తాను చేసిన నేరాన్ని తండ్రికి తెలియజేసి క్షమాపణ వేడుకున్నాడు. అంత చేస్తేగాని ఆయన మనసు కుదటపడలేదు." అని అన్నాడు శంకర్.

శంకర్ తనమాటలు ముగిస్తూనే గోపి గబగబా మెట్లు దిగాడు. గోపి దిగుతూ దిగుతూ కాలుజారి దొర్లుకున్నాడు. దెబ్బకూడా తగిలింది.

"ఏమిటి! ఏమిటి!!"అని అందరూ మెట్ల క్రిందపడివున్న గోపి చెంతకు వచ్చారు.

సుధాకరరావు గోపిని వొడిలోకి తీసుకున్నాడు. మంగమ్మ గబగబా తన చీరకొంగు చించి గోపి తలకు కట్టింది. కమలమ్మ కన్నీళ్లు పెట్టుకుని నిలచింది.

"పెట్టెనుండి రూపాయి ... నేనే ...దొంగలించాను...నాన్నా" అని బాధగా అన్నాడు గోపి.

అందరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

అప్పుడు అందరూ ఒకరిని ఒకరు అర్థం చేసుకున్నారు.

శంకర్‌తో గోపీ ఇలా అన్నాడు: "శంకర్! నేను రూపాయి తీసుకుంటున్నప్పుడు కొన్ని షరతులు పెట్టావు. అవి పిచ్చిషరతులనుకున్నా. కాని వాటివిలువ నాకిప్పుడు తెలిసింది. తప్పు ఒప్పుకుని పశ్చాత్తాపపడిన తరువాత నాకు పండుగ చేసుకున్నట్టుంది" అన్నాడు.

"నిజం చెప్పడంలో, పశ్చాత్తాపపడడంలో మహాత్మ్య" మదే! అన్నాడు శంకర్. ★

# ★ మనుషులూ...మనసులూ! ★

(12-వ పేజీ తరువాయి)

పాకలో రూపాయిపావలాకి కొనుక్కున్నాడు. శంకరం మానసికదృష్టిపథంలో రిక్షావాళ్లూ, హోటలు సెర్వర్లూ, రైల్వేపోర్టర్లూ, గంపలు మోసేవాళ్లూ, శరీరాన్నమ్ముకున్న వాళ్లూ, బళ్లులాగేవాళ్లూ... ఇంకా ఎందరెందరో ఒకరితర్వాత ఒకరు సాగిపోతున్నారు. వీళ్లంతా ఇంకా ఎందుకు బతికిఉన్నారు? అని శంకరం ఎప్పుడూ ఆలోచించలేదు. ఈరాత్రి ఆలోచిస్తుంటే సమాధానం దొరికింది.

ఆ మానసికవికాసంలో నే-ఆ ఉత్సాహంలో నే-ఆ నుగతిలో నే సందులోంచి మెయిన్‌రోడ్డుమీదికి గబగబా అడుగులు వేసేడు-మెయిన్‌రోడ్డు టర్నింగ్ కొడుతున్న కారు డ్రైవరుకి హెడ్‌లైట్ వెలుగులో హటాత్తుగా ఒక ఆకారం ఎదురైంది. బ్రేకులు ఒక్కసారిగా వేసి హారన్ కొట్టడం, శంకరం కారు బఫర్‌కి గుద్దుకొని రోడ్డు పక్కని పడిపోవడం క్షణంలో జరిగేయి. చుట్టుపక్కల ఉన్న జనం అంతా పరుగెత్తుకుంటూ వచ్చేరు. కారులోని వ్యక్తి అందర్నీ తోసుకుంటూ ముందుకు వంగి శంకరాన్ని చూసేడు. శంకరం కళ్లు విప్పి "నువ్వా!" అని మూలిగేడు. రొమ్ముకి పక్కలో తీవ్రంగా పోటు తగిలింది. ఊపిరి సరిగ్గా రావడంలేదు. అంతకి తప్ప మరేమీ ప్రమాదం జరగలేదు. చెంప, మోచేయి, గీసుకొని రక్తం చిమ్మింది.

"లే లే" అంటూ అతడు శంకరాన్ని లేవనెత్తేడు. అతడూ, డ్రైవరూ బుజాల మీద శంకరం చేతులుంచి తాపీగా నడిపిస్తూ పక్కనేఉన్న పాకనాటి నాయుడిగారి బ్రాందిషాపులోకి తీసుకువెళ్లేరు. ఎంత పెద్ద గలభా జరుగుతుందో అని గుమిగూడిన ప్రేక్షకమహాజనులు ఈ చిన్న ఫార్సుకి ఆశాభంగం పొందినవారై రంగంనుంచి నిష్క్రమించేరు.

ఆ కారులోఉన్న నాయుడూ, తనూ ఇంటర్మీడియట్‌లో క్లాసు మేట్లు. నాయుడూ, తనలోబాటే ఓపిగ్గా మూడుసార్లూ పరీక్షల్లో తప్పిన మూలంగా వీరిద్దరి స్నేహం మరింత దృఢపడింది ఆ రోజుల్లో. తిర్వాత నాయుడు విశాఖ వెళ్ళిపోయేడు. ఈనాడు మళ్ళీ పాత స్నేహితుణ్ణి కలుసుకోవడం.

"ఒరె శంకరం! నిన్ను మళ్ళీ ఇలాంటి పరిస్థితులలో కలుసుకున్నందుకు విచారంగా ఉందిరా. మరేం అనుకోవు గద!" అంటున్నాడు నాయుడు.

శంకరం తల గింగురింగు మంటోంది. ఎంతపని జరిగింది! ఒక్క సెకండు అటూ ఇటూ అయిపోయిఉంటే తనేలోకంలో ఉండేవాడో ఈపాటికి! ఇంతకీ భగవంతుడంటూ ఒకడు తనని కాపాడబట్టిగాని! అయినా తనకే అర్ధరాత్రి షికార్లెందుకో! మృత్యువుని మొదటిసారిగా పరిచయం చేసుకున్న శంకరంశరీరంలోని ప్రతీ నరం వణుకుతోంది. గుండె దడదడ కొట్టుకొంటోంది.

"ఇది కాస్త లోనికి పోనీయరా. మనస్సు కుదుటపడుతుంది" అంటున్నాడు నాయుడు. శంకరం ఆ కాస్తని లోనికి పోనిచ్చేడు.

"మరో పెగ్గు ఇప్పించరా" అన్నాడు. శంకరానికీ ఔషధం కొత్తకాదు. వాళ్ళనాన్నగారి హయాంలో నాయుడూ, శంకరం, ఈ దివ్యామృతపానంలో చాలాసార్లు మునిగి తేలుతూ ఉండేవారు. ఆ రోజులే వేరు. ఇప్పుడవి తిరిగి రావు. శంకరం గట్టిగా నిట్టూర్చేడు. బాగా మందు తీసుకున్న కొద్దిసేపటికి శంకరం హటాత్తుగా నాయుణ్ణి కావిలించుకొని ఏడ్చేడు.

"ఒరే నాయుడూ! ఎన్నాళ్ళకి మనం మళ్ళీ కలుసుకున్నాంరా!" అని నాయుడి రెండు బుగ్గల్నీ గట్టిగా ముద్దుపెట్టుకున్నాడు...

శంకరం బ్రాందీ షాపులోంచి బయటకొచ్చేసరికి షాపులోని గడియారం పదకొండు కొడుతోంది. తూలుకుంటూ ఇంటికి బయలుదేరేడు. పార్కుదగ్గర ఆగేడు.

"లేడీస్ ఎండ్ జంటల్ మెన్?" అన్నాడు పార్కు బెంచీలను సంబోధిస్తూ.

"హియర్! హియర్!" అన్నాడెవడో బెంచీల దగ్గరనుంచి.

"ఓడురా వాడు?" అని ప్రశ్నించేడు స్పీకరు. జవాబు రాలేదు. కాసేపాగి మళ్ళీ ప్రారంభించేడు శంకరం ఈమారు తెలుగులో.

"సోదరులారా! ఈ దేశంలో చావాలనుకున్నోడు గొప్పోడైనా కావాల-దమ్ములున్నోడైనా కావాల! కాని గుమస్తాలు మాత్రం చావాలన్నా చావలేరు. వాళ్లు రోజూ చచ్చి బతుకుతుండాలసిందే! ఆ! అంతే! నా సవాల్‌ని కాదనే మొగోడెక్కడెవడైనా ఉంటే ముందుకు రండి. ఈ షంకరం జవాబు చెప్తాడు. నీకేం భయం లేదురా షంకరం! నేనున్నాను నీదగ్గర!" అంటూ ఛాతీ చరుచుకున్నాడు. "కాదంటారా! లెవెల్ క్రాసింగ్‌దగ్గర పోర్టరు నడగండి. బారకాసు మైదానంలోని కోరవిడయ్యోన్నడగండి. మా గోపాలాన్నడగండి. ...ఒరే గోపాలం! ఎక్కడున్నావురా నువ్వు? అప్పు కావాలా? ఇండ! టీసోక్కు! నీ కెంట కావాలో అంట టీసోక్కు!"

శంకరం దగ్గర్లోని ఎలక్ట్రిక్ స్తంభాన్ని కావిలించుకొని గట్టిగా ఏడుస్తున్నాడు.

"పాపం! నిన్ను తన్నేనుకదూ! నేను దురాత్ముణ్ణి. పిరికివాణ్ణి. నాలాటి చాటకాని గుమస్తాలంటూ పెళ్లాల్ని టన్నడం కంటే ఇంకేం చెయ్యగల్ను?—ఏడుస్తున్నావా? ఛా! అలా ఏడవకూడదు. నేను చచ్చిపోటానని భయపడుతున్నావా? ఛస్! ఏదో టమాషాకి అలా అన్నానుగాని [illegible] చస్తానటే పిచ్చిపిల్లా! ఇడుగో! ఇటు చూడు! ఊరుకో. మా బాబువికదూ! నీకు ఖర్జూరం కొని పెడతాను. ఊరుకో. ఊరుకోవూ? దొంగలంజా ఛావు!"

ఎలక్ట్రిక్ స్తంభాన్ని ఒక్కతాపు తన్ని ముందుకు సాగేడు. "మేరీ జాన్ మేరీ జాన్ మేరీ" అని పాడుకుంటూ వెంకటేశ్వర స్వామి కోవెలదాకా తూలుతూ వచ్చేడు. వీధి మలుపు దగ్గర చెన్నయ్య శెట్టి రాత్రి ఒకటికని బయటకొచ్చిన వాడల్లా తాగిన వాడిని చూడగానే గబగబా ఇంట్లోకి పరుగెత్తి తలుపు ఢఢీమని వేసేసుకున్నాడు.

శంకరం వీధిలో ఏదో దొమ్మి జరుగుతున్నట్టుంది. తనని ముందుకు పోనియ్యని జనాన్ని చూస్తే చికాకు వేస్తోంతడికి. "ఇదేమిటయ్యా! అర్ధరాత్రయినా ఈ గోలంటూ టప్పుకోండి. టప్పుకోండి." అన్నాడు శంకరం ఇద్దరు ముగ్గుర్ని పక్కకి నెడుతూ. ఎవరో శంకరం చొక్కాని పట్టుకొని ఆపేరు. "నువ్వట్రా శంకరం! అరి దౌర్భాగ్యుడా! ఇంతసేపాయి ఎక్కడ తిరుగుతున్నావురా?" అన్నాడతడు. "ఏం ఏం కావాలి?"

"ఇంకా ఏం కావాలని అడుగుతున్నావా? నీకింకా తెలీదూ? ని పెళ్లాం రెండుగంటల క్రితం నూతులో గెంతేసిందిరా!..."

శంకరం అక్కడే, ఆ మట్టి నేలలోనే చతికిల పడిపోయేడు. రావివారి పడియాలో వీధికుక్కలు వికారంగా అరుస్తుంటే దట్టముగా మబ్బు పట్టిన ఆకాశం ఒక్కసారి ఉరిమింది. ★



"మస్త్‌కలందర్" చిత్రంలో అరేబియన్ రాజకుమార్తెగా షకీలా.



ఎ. వి. ఎమ్. వారి "వదిన"లో నాగేశ్వరరావు, సావిత్రి.

మన దేశంలో ప్రదర్శింపబడే విదేశీయ చిత్రాల్లో అత్యధిక భాగం అమెరికన్ చిత్రాలే. మిగతావన్నీ బ్రిటిష్ చిత్రాలు. ఎప్పుడైనా ఒక ఇటాలియన్ చిత్రమో, జాపనీస్ చిత్రమో, రష్యన్ చిత్రమో తొంగిచూసినా చూడవచ్చుగాని ఫ్రెంచి, జర్మన్, స్వీడిష్ మొదలైన చిత్రాలు ఈ ఛాయలకే రావు. వచ్చినా ఆయా దేశాల రాయబార కార్యాలయాలద్వారా కొద్ది మందికి ప్రైవేట్‌గా చూపించడం జరుగుతుంది. హాలీవుడ్‌కంటే ఎన్నోవిధాల ఉత్తమ కళాత్మక చిత్రాలు సృష్టించే యూరోపియన్ దేశాల చిత్రాలు చూసే అవకాశం మన దేశంలో పూర్తిగా లేకుండా పోతోంది. విదేశీయ చిత్రాలు ప్రదర్శించే మన థియేటర్లన్నీ అమెరికన్ డిస్ట్రిబ్యూటర్ల సంస్థ వ్యాపారానికి లోబడిపోయి ఉన్నాయి. ఈ పరిస్థితిపట్ల మన ఫిలిం పారిశ్రామికులు ఇటీవలనే అసంతృప్తి, ఆందోళన వ్యక్తీకరించడం మొదలుపెట్టారు.

హాలీవుడ్ చిత్రాల ప్రాబల్యంమూలంగా మన చిత్రపరిశ్రమ అనేకవిధాల నష్టపోతున్నది. ముఖ్యంగా మన నిర్మాతలకు, ప్రేక్షకులకు ఆ చిత్రాలే ఆదర్శప్రాయమై పోతున్నవి. ఇతరదేశాల చిత్రాల్ని గురించి మనం తెలుసుకోవడానికి, తద్వారా మన చిత్రపరిశ్రమ ప్రయోజనం పొందడానికి వీలు లేకుండాపోతున్నది. దీన్ని గురించి మన జాతీయప్రభుత్వం ఏమాత్రం శ్రద్ధవహించకపోవడం విచారకరం.

* * *

కొన్ని రోజుల క్రిందట మద్రాసులో చెకోస్లోవాక్ చిత్రాలు కొన్ని ప్రైవేటుగా ప్రదర్శించబడినవి. ఈ చిత్రాలను వివిధభాషల్లో సబ్ టైటిల్స్‌తో సహా విడుదలచేస్తే అవి ప్రజాదరణ పొందుతాయనడానికి సందేహం లేదు. ముందుముందు అవి విడుదల అవుతాయని తెలుస్తోంది. ఇలాగే అడపాతడపా వివిధదేశాల చిత్రాలను విడుదల చేయడం అన్నివిధాలా లాభదాయకమైనపని.

గత వారం మద్రాసులో యుగోస్లావ్ చిత్రాలు చూడటానికి మాకు అవకాశం కలిగింది. అయితే ఈ అవకాశం పత్రికా విలేఖరులకు, మరికొందరికే మాత్రమే కలిగింది. నిజానికి ఆ చిత్రాలు వ్యాపారరీత్యా విడుదలచేయడానికి ఉద్దేశింపబడినవి కావు. ఆ చిత్రాలు కేవలం ప్రయోగాత్మకమైన (ఎక్స్‌పెరిమెంటల్) చిత్రాలు. [illegible] యుగో

#  అదీ - ఇదీ 

స్లావ్ రాయబార కార్యాలయానికి చెందిన సాంస్కృతిక వ్యవహారాల అధికారి కడో మిర్ మిండరోవిచ్ ఈ చిత్ర ప్రదర్శన ఏర్పాటుచేశారు. ఇవన్నీ చిన్న చిత్రాలు. 16 మిల్లిమీటర్ల ఫిలిమ్‌పై తీయబడినవి.

"ది సాంగ్ ఆఫ్ ది ప్రిజనర్" (ఖైదీ గీతం) "ఫర్ లైఫ్" (జీవితంకోసం) అనేవి రెండూ ప్రయోగాత్మక చిత్రాలు. ఒక ద్వీపదుర్గంలో బంధింపబడిన ఖైదీ మనస్సులో కల్లోలంగా బయలుదేరే భావాలను ఈ చిత్రాలు రెండూ చిత్రించడానికి ప్రయత్నిస్తాయి. మొదటిచిత్రంలో, నీటిమీద సూర్యకాంతి పడుతుంది. గాలివీచి నీరు కదులుతుంది. నీటిలో అలలకదలిక ఖైదీ మనస్సులో ఉత్పన్నమయ్యే భావ తరంగాల సంఘర్షణను, కల్లోలాన్ని సూచిస్తుంది.

రెండో చిత్రంలో, సున్నం పెల్లలు ఊడిపోయిన గోడలమీద వాటంతట అవే ఏర్పడిన రకరకాలైన అస్పష్టాకృతులను ఖైది పరిశీలిస్తూ, తన జీవితంలోని మధుర ఘట్టాలను, వేదనాపూరిత స్మృతులను వాటితో సమన్వయించుకొంటాడు. అతని చుట్టూఉన్న ఖైదు గోడలమీద మనుషుల, జంతువుల, భూతాల వింత ఆకృతులు ఊహా ప్రాయంగా కనిపించి అతనిలో ఆ వేదన కలిగిస్తాయి. కిటికీలోంచి చూస్తే, దూరంగా ఒంటరిగా ఎగిరే విహంగం బాహ్య ప్రపంచపు స్వేచ్ఛాజీవితానికి సంకేతంగా కనిపిస్తుంది.

మూడవది చిన్న డాక్యుమెంటరీ చిత్రం. శతాబ్దాల క్రితం వైభవ మనుభవించిన పిరాన్ అనే యుగోస్లావ్ రేవు పట్టణపు ప్రస్తుత శిథిలావస్థ ఈ చిత్రంలో చూపబడింది. నెపోలియన్ సైన్యాలు రాత్రిపూట ఈ పట్టణం ప్రవేశించి సర్వనాశనం చేయడం ఛాయామాత్రంగా చూపబడుతుంది. కలకలలాడే భవనాలు, ఉద్యానవనాలు, అపురూప శిల్పాలు, జలయంత్రాలు అన్నీ ధ్వంసమైపోయి శ్మశాన సదృశమైన "మృతనగరం" మిగులుతుంది. ఎక్కడచూచినా మొండిగోడలు, కూలిన మెట్లు, చేతులు తెగిన శిల్పాలు కనిపిస్తాయి. ఈ చిత్రానికి ఇంగ్లీషు వ్యాఖ్యానంకూడా చాలా రసవంతంగా ఉన్నది.

"*Where are the snows of Yester-year?*" అని ఫ్రెంచికవి ఫ్రాంస్వా విలాన్ వాపోయినట్లు "ఏవీ నీ ఉద్యానవనాలు? ఏదీ నీ కళాసౌందర్యం?" అని వ్యాఖ్యాత్రి మృతనగరాన్ని ప్రశ్నిస్తుంది. ఈ డాక్యుమెంటరీ చూస్తున్నంతసేపూ, మహోజ్వల చరిత్ర గల హంపీ శిథిలాలపై ఎంత మంచి చిత్రం తీయవచ్చునో అని ఆలోచన కలుగుతుంది.

* * *

ప్రయోగాత్మక చిత్రాలను వ్యాపార స్థాయిలో విడుదల చేయడం కష్టమైనప్పటికీ, ఆ చిత్రాలు అనేకవిధాల చిత్రపరిశ్రమకు ఉపయోగపడతాయి. ఇటలీ, ఫ్రాన్సు, అమెరికా, రష్యా, జర్మని మొదలైన దేశాల్లో ఉత్సాహవంతులైన దర్శకులనేకులు ఏళ్ల తరబడి జరిపిన పరిశోధనల, ప్రయోగాల ఫలితాలనే ఇప్పటిఫిలింపరిశ్రమలు ఉపయోగించుకుని, వ్యాపారంచేసి లాభం పొందుతున్నాయనేది గుర్తుంచుకుంటే పై వాక్యం

నేషనల్ ఆర్టుథియేటరువారి "జయసింహ"లో కత్తియుద్ధం చేస్తున్న ఎన్. టి. రామారావు, రాజనాల.

ఆర్. కె. ఫిలిమ్స్‌వారి "శ్రీ 420"లో నాదిరా.

లోని సత్యం బోధపడుతుంది. భావ వ్యక్తీకరణకు సినిమాకళలో అపారమైన అవకాశాలు, అనంతమైన మార్గాలు ఉన్నాయని అనేకులకు తెలియదు. ఈ అవకాశాలను, మార్గాలను శోధించడానికి నిరంతరం ప్రయోగాలు జరుగుతూ ఉండాలి. ఈ ప్రయోగాలు తక్షణం ఫలితాలనువ్వకపోవచ్చును. కాని ఎప్పుడో ఏ సందర్భంలోనో అనుకోకుండా అవి ఉపకరిస్తాయి. యుగోస్లావియాలో ప్రభుత్వం పైన చెప్పిన ప్రయోగాత్మక చిత్రాలనిర్మాణాన్ని అనుమతించి, ప్రోత్సహిస్తున్నదంటే, సినిమా కళపట్ల ఆ ప్రభుత్వానికి గల శ్రద్ధ వ్యక్తమవుతున్నది. ప్రైవేటు నిర్మాతలు, పెట్టుబడి దారులు సత్వర లాభాలు సంపాదించాలనే దృష్టిలోనే ఎప్పుడూ ఉంటారు కనుక, మన దేశంలో వారినుండి ఇటువంటి మంచిపనులు ఆశించటం అనవసరం. కనుక ఈ విషయములో మన ప్రభుత్వం చేయవలసినది ఎంతైనా ఉన్నది. రేపు స్థాపించబోయే ఫిలిమ్ ఇన్స్టిట్యూట్ ఇటువంటి ప్రయోగాత్మక కళా వ్యాసంగానికి మంచి అనువైన రంగం. మూసలో పోసి తయారు చేసినట్లుగా, టెక్నీషియన్లను, దర్శకులను తయారుచేయడం కాకుండా, వారిలో భావనాశక్తి, సృజనశక్తి పెంపొందేందుకు అవకాశాలు కలిగించాలి. ధన వ్యయానికి వెనుదీయకుండా, అనేక విధాలుగా ప్రయోగాలు జరిపించాలి. ఆ విధంగా తర్ఫీదు, అనుభవం పొందిన దర్శకులు, టెక్నీషియన్లు ఫిలిం పారిశ్రామిక రంగంలో ప్రవేశించినప్పుడు చిత్రాల స్థాయి అభివృద్ధి అయేందుకు అవకాశం తప్పకుండా ఉంటుంది. పాడిన పాటే పాడుతూ, గానుగెద్దులాగ ఒకే గాడిలో తిరిగే మన ఫిలిం పరిశ్రమలోకి, కొత్త భావాలు, కొత్త అభిరుచులు, నవ శుభ్రమైన వాయువులు ప్రవేశించడానికి అప్పుడే వీలు కలుగుతుంది. ఈ పని నెరవేర్చినప్పుడే ఫిలిం ఇన్స్టిట్యూట్ వంటి సంస్థ సార్థకమవుతుంది.



## భారతీయ నిర్మాతలకు సినిమాస్కోప్ సహాయం

భారతీయ చిత్రనిర్మాతలు కోరినట్లయితే, సినిమాస్కోప్ చిత్రాలు నిర్మించేందుకు అవసరమైన టెక్నికల్ సహాయం చేయగలమని ట్వంటియత్ సెంచరీ ఫాక్స్ కార్పొరేషన్ అధ్యక్షుడు స్పైరస్ పి. స్కౌరాస్ ఇటీవల మద్రాసు వచ్చినప్పుడు వెల్లడించారు.

అమెరికాలో సినిమాస్కోప్ చిత్ర నిర్మాణం [illegible] మొత్తం 20000 థియేటర్లలో 14,970 థియేటర్లు సినిమాస్కోప్ [illegible] అనుస్యూతంగా [illegible] అన్ని థియేటర్లు [illegible] ఉన్నారు.

టెలివిజన్ అభివృద్ధితో సినిమా ప్రేక్షకుల సంఖ్య నూటికి 48 వంతుల చొప్పున, రాబడి 42 వంతుల చొప్పున పడిపోయి, 6 వేల థియేటర్లు మూతపడినాయని, సినిమాస్కోప్ చిత్రాలమూలంగా తిరిగి హాలీవుడ్ పరిశ్రమ పూర్తిగా కోలుకున్నదనీ ఆయన తెలియజేశారు.

భారతదేశంలో సినిమా పరిశ్రమ కావలసినంత బాగా అభివృద్ధికానందుకు విచారం వెలిబుచ్చుతూ వాసన్ ఇలా అన్నారు: "36 కోట్ల భారతీయులకు 8 వేల థియేటర్లు మాత్రమే ఉండడం ఆశ్చర్యం. 6 కోట్ల జనాభాగల ఇటలీలో 9 వేల థియేటర్లు ఉన్నాయి. అమెరికాలో 28 వేల థియేటర్లు ఉన్నాయి. ఈ దేశంలో ఇంకా ఎక్కువ థియేటర్లు నిర్మింపబడేటట్లు ఫిలిం పారిశ్రామికులు కృషిచేయాలి. దీని కవసరమైన సహాయం అమెరికన్ పరిశ్రమ చేస్తుంది."

ఫాక్స్ కార్పొరేషన్ అధ్యక్షునికి ఫిలిం ఫెడరేషన్ అధ్యక్షుడు ఎస్. ఎస్. వాసన్ స్వాగతసత్కారాలు జరిపారు.

# సినిమా వార్తలు

జూపిటర్ పిక్చర్స్‌వారు ఆగస్టు 19 వ తేదీ ఉదయం కొత్త ద్విభాషా చిత్రానికి ప్రారంభోత్సవం జరిపారు. ఈ చిత్రం తెలుగు, హిందీ భాషలలో నిర్మింపబడుతుంది. కొన్ని పాటలు రికార్డు చేయబడినవి. నెప్ట్యూన్ స్టూడియోస్‌లో షూటింగ్ సాగుతున్నది. తెలుగు చిత్రానికి సదాశివబ్రహ్మంగారు సంభాషణలు వ్రాస్తున్నారు. పి. పుల్లయ్యగారు దర్శకత్వం నిర్వహిస్తున్నారు. నాగయ్య, కన్నాంబ, శ్రీరంజని, రేలంగి మున్నగువారు నటిస్తున్నారు.

జూపిటర్‌వారు ఎన్. టి. రామారావు, అంజలీదేవి, జమున మున్నగువారితో నిర్మిస్తున్న మరొక తెలుగు, హిందీ ద్విభాషా చిత్రం "ఇదే దారి" (నయా ఆద్మీ) పూర్తి కావచ్చినదని తెలుస్తోంది.

* * *

నరసూ స్టూడియోస్‌వారి కొత్త ద్విభాషా చిత్రం (తమిళం, తెలుగు) ప్రారంభోత్సవం కూడా ఆగస్టు 19 వ తేదీన జరిగింది. పూర్వం గొప్ప విజయంపొందిన బొంబే టాకీస్‌వారి "కిస్మత్" (అశోక్‌కుమార్, ముంతాజ్ శాంతి) ఆధారంగా ఈ చిత్రం నిర్మించబడుతున్నది. దర్శకుడు వేదాంతం రాఘవయ్య. తెలుగు చిత్రానికి సదాశివబ్రహ్మంగారు సంభాషణలు వ్రాస్తున్నారు. నాగేశ్వరరావు, సావిత్రి, రేలంగి, గిరిజ, శివరాం ఈ చిత్రంలో నటిస్తున్నారు. సంగీతం ఎస్. రాజేశ్వరరావు నిర్వహిస్తున్నారు.

* * *

మద్రాసు సినీ టెక్నిషియన్ల సంఘం వారు 1955 – 56 సంవత్సరానికి కొత్త కార్యవర్గాన్ని ఎన్నుకున్నారు. ఎ. కృష్ణన్ అధ్యక్షులుగా, హరిబాబు, లింగమూర్తి ఉపాధ్యక్షులుగా, కృష్ణస్వామి, రజనీకాంత్ కార్యదర్శులుగా, యోగానంద్ కోశాధికారిగా ఎన్నుకోబడ్డారు.

* * *

పక్షిరాజావారి హిందీ చిత్రం "ఆజాద్" కలకత్తాలో ఇటీవల రజతోత్సవం (25 వారాలు) జరుపుకున్నది.

* * *

విభూతి భూషణ్ బంద్యోపాధ్యాయ రచించిన ప్రసిద్ధ నవల "పథేర్ పాంచాలి" ఆధారంగా పశ్చిమబెంగాల్ ప్రభుత్వం నిర్మించిన అదే పేరుగల చిత్రం కలకత్తాలో విడుదల అయింది. దర్శకుడు సత్యజిత్ రాయ్. బెంగాల్ గ్రామజీవిత సౌందర్యాన్ని ఈ చిత్రం హృదయంగమంగా చూపిస్తుంది.

(ఈ నవల ఆంధ్రానువాదం 'ఆంధ్ర వారపత్రిక'లో సీరియల్‌గా త్వరలో ప్రకటింపబడనున్నది.)

* * *



"మునీంజీ" చిత్రంలో నళినీ జయవంత్.

హిందీ నిర్మాత గురుదత్ నిర్మిస్తున్న "సి. ఐ. డి." చిత్రంలో తెలుగు నటి వహీదా రహమాన్ దేవ్ ఆనంద్‌తో కలిసి నటిస్తున్నది. ఈ చిత్రం దర్శకుడు రాజ్ ఖోస్లా. సంగీత దర్శకుడు ఓ. పి. నయ్యర్.



## ★ బొంబాయి సినిమా లేఖ ★

బొంబాయిసినిమారంగంలో ఈమధ్య కొన్నిరోజులపాటు వివాహాలు, ప్రేమకలాపాలు జరిగాయి. వీటన్నిటిలో ఆశ్చర్యకరమైనదీ, హఠాత్తుగా జరిగినదీ షమ్మీ కపూర్, గీతాబాలీ వివాహం. వీరి ప్రేమ నాలుగు నెలలక్రిందట ప్రారంభమైంది. కిదార్ శర్మ చిత్రం "రంగీన్ రాతే" 'లొకేషన్ షూటింగ్' కోసం నైనిటాల్‌కు ఇరువురూ కలిసి వెళ్ళడం తటస్థించింది. అక్కడినుండి తిరిగి రాగానే, ఇరువురూ వివాహానికి తేదీని, స్థలాన్ని నిర్ణయించుకున్నారు. కాని షమ్మీ కపూర్ అనుకున్న ప్రకారం రాలేకపోయాడు. అతని ప్రయత్నానికి తండ్రి పృధ్వీరాజ్ అడ్డంపడ్డాడని అనుకున్నారు. గీతాబాలికంటే షమ్మీ కపూర్ మూడేళ్ళు చిన్నవాడు కావడంవల్ల పృధ్వీరాజ్ ఈ వివాహానికి ఒప్పుకోలేదట, గీతాబాలి వయస్సు దాదాపు 26 ఏళ్లు.

పృధ్వీరాజ్ తిరిగి తన అభిప్రాయం మార్చుకోవడంవల్ల ఆగస్టు 24 తేదీన షమ్మీ, గీతాల వివాహం నిరాటంకంగా జరిగిపోయింది. పృధ్వీరాజ్, రాజ్ కపూర్‌లు దంపతులను ఆశీర్వదించారు.

త్వరలో వివాహంచేసుకోనున్న మరొక జంట నాదిరా, అసిస్టెంట్ డైరెక్టర్ టి. కె. బోస్. ఈయన "దువా" చిత్రనిర్మాత వేణుదత్ బావమరది. ఈయన నాదిరాను వివాహం చేసుకోబోతున్నాడనే వార్త అందరికీ ఆశ్చర్యం కలుగజేసింది. ఎందుకంటే ఆమె సాధారణంగా వివాహం చేసుకునే పద్ధతి వ్యక్తిగా ఎవరూ భావించలేదు. ఆమె ఒక తివాచీల వర్తకునివద్ద ఉద్యోగంతో జీవితం ప్రారంభించింది. తరువాత ఆమెను నిర్మాత మెహబూబ్ బుక్ చేసి, "ఆన్" చిత్రంలో రాజకుమారిగా చిత్రరంగంలోకి ప్రవేశపెట్టాడు. తరువాత కవి, నిర్మాత నక్షబ్ వద్ద చేరి ఆయన చిత్రాలు రెంటిలో నటించింది. "గరఫ్తార్" చిత్రం అపజయం పొందడంతో వారు విడిపోయారు.

హాస్యనటుడు జానీ వాకర్ తార షకీలా చెల్లెలు నూర్‌ను ఆగస్టు 17న వివాహం చేసుకున్నాడు. అతడు నూర్‌తో కలిసి చాలా చిత్రాల్లో నటించాడు. వాటిలో ముఖ్యమైనవి "ఆర్ పార్" "మస్త్ కలందర్". జానీ వాకర్ అసలు పేరు బద్రుద్దీన్ అలీ; లక్నో వాస్తవ్యుడు.

త్వరలో జరుగనున్న మరొక వివాహం క్రొత్తనటి వినీతాబట్, మేకప్‌మాన్ జిమ్మీ వినింగ్‌లది. వినీతా తల్లి ఇంగ్లీషు స్త్రీ; తండ్రి కాశ్మీరీ బ్రాహ్మణుడు. వినీతా, జిమ్మీ ఫిల్మిస్థాన్ వారి "శ్రీ హడ్‌డ్రోబా" చిత్రంలో పని చేస్తున్నారు. అక్కడే వారి ప్రేమఆరంభమై వివాహంగా పర్యవసించనున్నది. వినితాకంటే జిమ్మీ వినింగ్ చాల ఏళ్లు పెద్దవాడు.

వినీతాబట్‌కు ఒక హాలీవుడ్ చిత్రంలో నటించమని ఆహ్వానం వచ్చినట్లు తెలుస్తోంది.

(ఆంధ్ర వారపత్రిక విలేఖరి)



ఏ. వి. ఎమ్. వారి "వదిన"లో నాగేశ్వరరావు, పండరీ బాయి.



జి. పి. సిప్పీ నిర్మించిన "మెరైన్‌డ్రైవ్" హిందీ చిత్రంలో మోహనా.

Printed and Published for Nageswara Rao Estates Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor: S. Sambhu Prasad.



కొలను కలువ —చిత్రకారుడు: ఎస్. నాగవెంకటాచలం, మద్రాసు.